# 'బర్డ్' నుంచి 'ఫ్లూ' దాకా...

జంతువులు, పక్షుల్లో కనిపించే బర్డ్‌ఫ్లూ కారక వైరస్ వాటినుంచి నుంచి మనుషులకు ఎలా వస్తుందంటే... ఇన్‌ఫ్లూయెంజా. బీ, సీ-వైరస్‌లు కేవలం మనుషులకే సోకుతాయి. కానీ ఏ-రకం పక్షుల్లోనూ, మానవుల్లోనూ కనిపిస్తుంది. ఇది ఒకరి నుంచి మరొకరికి వ్యాపిస్తుంది.



**1 స్వాభావిక వాహకాలు...** బాతులు ఎక్కువగా ఇన్‌ఫ్లుయెంజా ఏ వైరస్ బారిన పడతాయి. ఇవే ఈ వైరస్‌ను చేరవేసే వాహకాలుగా పనిచేస్తున్నాయి. అయితే కోళ్లకు మాత్రం ఈ వైరస్‌ను తట్టుకునే శక్తి లేదు.

**2** ఇలా వైరస్ బారిన పడ్డ పక్షుల్లో ఆ వైరస్ వాటి విసర్జకాల్లో ఉంటాయి. ఈ పక్షుల్ని మానవులు దగ్గరగా తీసుకోవడం వల్ల వాటి శరీరంపై ఉన్న దుమ్మును పీల్చడంతో వైరస్ వారిలోకి ప్రవేశిస్తుంది.

**హీమాగ్లుటినిన్(HA ప్రొటీన్):** ఇది మానవుల్లోని కణజాలం పైభాగానికి వైరస్‌ను అతికేలా చేస్తుంది.

**NA ప్రొటీన్:** ఇది కణంలోపల వైరస్ విచ్ఛిత్తి చెందేందుకు తోడ్పడుతుంది. కొత్త వైరస్ కణాలు విడుదలవడంతో రోగిలో ఇన్‌ఫ్లుయెంజా వ్యాధి పెరుగుతుంది.

మాట్రిక్స్ ప్రొటీన్ పొర

**వైరస్ స్థావరం:** ఇన్ఫెక్షన్‌కు గురైన కణం నుంచి పొరను తీసుకుని అందులో ఉంటాయి.

**న్యూక్లియోకాప్సిడ్:** ఎనిమిది ఆకుల్లాంటి నిర్మాణంగల RNAలో జన్యుపటంఉంటుంది

**ఏ-రకంలోని ఉపరకాలు:** 15 HA ఉపరకాలు, 9 NA ఉపరకాలను పక్షుల్లో కనుగొన్నారు. కేవలం H1, H2, H3 రకాలు, N1, N2 రకాలే మానవుల్లో కనబడుతున్నాయి.




**3 జన్యుమార్పిడి:** ఒకవేళ రెండు వేర్వేరు రకాల వైరస్‌లు ఒకేసారి రోగి కణంపై దాడిచేస్తే... అవి ఒకదాని RNAను మరో దానితో మార్పిడి చేసుకుంటాయి. కొత్త రకం వైరస్‌ను ఏర్పరుస్తాయి.

**4 మానవ వ్యాధినిరోధక వ్యవస్థ:** మనశరీరంలో ఉండే యాంటీబాడీలు ఈ కొత్త వైరస్‌తో అంత సమర్థమంతంగా పోరాడలేవు.



**కొత్త RNA జన్యువు:** ఇప్పుడు ఈ వైరస్ మానవుల్లో సులభంగా వ్యాప్తిచెందే శక్తిని సంతరించుకుంటుంది.

**న్యూరామినిడేస్ అవరోధకాలు:** టామీఫ్లూ, రెలింజా వంటి మందులు ప్రస్తుతం మార్కెట్‌లో అందుబాటులో ఉన్నాయి.




**చికిత్స:** న్యూరామినిడేస్ అవరోధకాలు అన్ని రకాల ఫ్లూను సమర్థమంతంగా తగ్గిస్తాయి.

© GRAPHIC NEWS

# ఎలా వ్యాపిస్తుందంటే...

న్యూస్‌టుడే - తిరుపతి 

**బర్డ్** ఫ్లూ వ్యాధి ప్రధానంగా చైనా, రష్యా, కంబోడియా, లావోస్ వంటి దేశాలను వణికిస్తోంది. మన రాష్ట్రంలోనే కాదు... దేశంలోనూ ప్రస్తుతానికి బర్డ్‌ఫ్లూ వ్యాధి సోకినట్లు ఎక్కడా దాఖలాలు లేవని శాస్త్రవేత్తలు పేర్కొంటున్నారు. రాష్ట్రంలో సుమారు 20 వేల మంది కోళ్ల రైతులున్నారు. తొలుత 1878లో ఈ వ్యాధి ఇటలీలో బయటపడింది. 2003లో ఒకసారి ఈ వ్యాధి ప్రపంచంలోని కొన్ని దేశాలకు విస్తరించగా... అప్పట్లో ఈ వ్యాధిని అదుపుచేయడం అసాధ్యమైంది. హెచ్5ఎన్1 అనే స్ట్రెయిన్ వల్ల ఇది సోకుతుంది. పక్షుల ద్వారా వ్యాపించే ఈ వ్యాధి అధిక శాతం కోళ్ల ద్వారా వ్యాపిస్తుందని సోకుతుందని పరిశోధనల్లో తేలింది.

## వ్యాధి లక్షణాలు

బర్డ్ ఫ్లూ వ్యాధి రెండు రకాలు. మొదటి రకం బర్డ్ ఫ్లూ వచ్చిన కోళ్లు అనారోగ్యంతో ఉండడంతో పాటు గుడ్ల ఉత్పత్తి గణనీయంగా తగ్గుతుంది. రెండోది చాలా ప్రమాదకరమైంది. ఈ వ్యాధి సోకిన కోళ్లు నూటికి నూరు శాతం మరణిస్తాయి. దీనిలో రైబోస్ న్యూక్లిక్ యాసిడ్ వైరస్ ఉంటుంది. దీనిలో ఎ, బి, సి అనే మూడు రకాలు ఉన్నాయి. ఎ రకం వైరస్ అధికంగా కోళ్లలో కన్పిస్తుంది. బి, సి రకాలు మనుషుల్లో కన్పించే అవకాశం ఉంది. ఒక దేశం నుంచి మరో దేశానికి వలసపోయే నీటి పక్షులు, పక్షుల ముక్కు నుంచి కారే ద్రవాలు, రెట్టలు, గాలి, ధూళి, పగిలిన గుడ్లు, వ్యాధి సోకిన పక్షుల లాలాజలంలో వైరస్ ఉంటుంది. రెట్టలోని ఈ వైరస్ దుమ్ము, ధూళిలో కలసి పోయే అవకాశం ఉంటుంది. దీని వల్ల ఒక ప్రాంతంనుంచి మరొక ప్రాంతానికి విస్తరిస్తుంది. ఒక గ్రాము రెట్టలో పది లక్షల కోళ్లకు వ్యాధి విస్తరించే క్రిములు ఉంటాయి. దుమ్ము, ధూళి ద్వారా ఎక్కువగా చిన్నపిల్లలకు ఈ వ్యాధి సోకే ప్రమాదం ఉంది. ఈ వ్యాధి సోకిన పిల్లల్లో జ్వరం దగ్గు, జలుబు, గొంతు మంట వంటి లక్షణాలు కనిపిస్తాయి. పెద్దల్లో ఊపిరితిత్తులు, మూత్రపిండాలు దెబ్బతినే ప్రమాదం ఉంటుంది. మన దేశంలో ఉష్ణోగ్రత సాధారణంగా 35-45 డిగ్రీల సెంటీగ్రేడ్ వరకు ఉండటం వల్ల ఈ వైరస్ వ్యాప్తి చెందే అవకాశం లేదు. కోడి మాంసాన్ని కూడా మనదేశంలో 70 డిగ్రీల సెంటీగ్రేడ్ వద్ద ఉడికించి ఆహారంగా తీసుకుంటాం. దీని వల్ల వ్యాధి సోకే అవకాశాలు లేవని శాస్త్రజ్ఞులు చెబుతున్నారు. పైగా పుణె, హైదరాబాద్ నగరాల్లో నిర్వహించిన పరిశోధనల్లో బర్డ్ ఫ్లూ ఉన్నట్లు నిర్ధారణ కాలేదు. రాష్ట్రంలో కోళ్ల రైతులు బర్డ్ ఫ్లూ గురించి ఆందోళన చెందాల్సిన అవసరం లేదని రాష్ట్ర పౌల్ట్రీ ఫెడరేషన్ అధ్యక్షులు కసిరెడ్డి నారాయణరెడ్డి చెబుతున్నారు. అయితే కొల్లేరు, పులికాట్ సరస్సుల పరిసర ప్రాంతాల రైతులు తగిన జాగ్రత్తలు తీసుకోవాలని తిరుపతిలోని పశువైద్య కళాశాల పౌల్ట్రీ విభాగం ప్రొఫెసర్ పి.వి.వి.సత్యనారాయణరెడ్డి తెలిపారు.

ఇంటర్ ఫిజిక్స్ (ఫస్ట్ ఇయర్)

# నేల విడిచి సాము



ప్రొఫెసర్ ఈ.వి. సుబ్బారావు

**ఆలోచనలకు, ఊహలకు పరిమితం కాకుండా అంతరిక్షంలోని అంతరాంతరాలను స్వయంగా వీక్షించాలనే తపన మానవుడికి అనాదిగా ఉంది. 'భూమ్యాకర్షణ'ను అధిగమించి రోదసిలోకి పలాయనం చిత్తగించడానికి కావలసిన సమీకరణాలను భౌతిక శాస్త్రం సమకూర్చింది. చీమకైనా, దోమకైనా చివరకు ఏనుగుకైనా 'పలాయన వేగం' ఒకటే. ఈ విషయంలో తేడా లేదు.**

భూమి నుంచి పైకెగిరి పక్షుల్లా ఆకాశంలో విహరించాలనే కోరిక మానవుడికి ఎన్నాళ్ల నుంచో ఉంది. ఆ ప్రయత్నంలోని భాగమే రాళ్లను పైకి విసరడం, గాలిపటాలు ఎగరేయడం.

**విశ్వామిత్రుడి ఊహ:** మహర్షి విశ్వామిత్రుడు యాగం చేయాలనే సంకల్పంతో హరిశ్చంద్రుడి వద్దకు వచ్చి ధన సహాయం కోరతాడు. రాజు ఎంత ధనం కావాలంటే 'బలవంతుడొకడు ఏనుగుపై నిలబడి తన బలమంతా ఉపయోగించి ఒక రత్నాన్ని (రాయిని కాదు) నిటారుగా పైకి విసిరితే, ఆ రత్నం ఎంత ఎత్తుకు వెళ్తే అంత ఎత్తు ధనరాశి కావాలి' అంటాడు రుషి. ఈ కథలో మనకు ధనరాశి పరిమాణం తెలియదు కానీ, ఒక వస్తువును మనం ఎంత ఎక్కువ బలంతో నిటారుగా పైకి విసిరితే, అది అంత ఎక్కువ ఎత్తుకు పయనిస్తుందనే భౌతికశాస్త్ర సూత్రం తెలుస్తుంది.

**పెరుగుట విరుగుట కొరకే:** ఎంత ఎత్తుకుపోయినా, పైకి పోయింది, కింద పడక మానదుకదా! ఈ దృగ్విషయాన్ని ఐజాక్ న్యూటన్ 16వ శతాబ్దంలోనే చెప్పాడు. 'కొంత ఎత్తుకు విసిరిన వస్తువులు భూమికి ఉండే 'గురుత్వాకర్షణ' ధర్మం వల్ల మళ్లీ భూమిపై పడతాయి. ఆ మహనీయుడు తన కలలో కూడా ఊహించని విషయం- ఏదో ఒకరోజు మానవుడు ఈ భూమ్యాకర్షణను కూడా అధిగమించి నేల విడిచి సాము చేస్తాడని'.

**పలాయన వేగం:** వస్తువును నిట్టనిలువుగా పైకి విసిరే వేగం పెంచుతూ పోతే, భూమి నుంచి ఆ వేగం సెకనుకు 11.2 కిలోమీటర్లు. వేగం అంతకంటే ఎక్కువైతే ఆ వస్తువు భూమ్యాకర్షణను అధిగమించి, తిరిగి భూమి మీదకు రాకుండా విశ్వాంతరాళంలోకి వెళుతుంది. ఈ వేగాన్ని 'పలాయన వేగం (escape velocity)' అంటారు. పలాయన వేగం $V_e = \sqrt{2gR}$

ఈ సూత్రం న్యూటన్ విశ్వగురుత్వాకర్షణ సూత్రం (Universal law of gravitation) నుంచి రాబట్టారు. పలాయనవేగం $V_e$, గ్రహం గురుత్వ త్వరణం g, వ్యాసం R, పై ఆధారపడి ఉంటుంది. మనం పైకి విసిరే వస్తువు ద్రవ్యరాశిపై ఏమాత్రం ఆధారపడదు. దోమ నుంచి ఏనుగు వరకు, రాకెట్ మొదలు పరమాణువు వరకు ఒక గ్రహం నుంచి ఒకే పలాయన వేగాన్ని కలిగి ఉంటాయి. చంద్రుడి గురుత్వ త్వరణం (g) తక్కువ కాబట్టి, అక్కడి పలాయనవేగం 2.5 $Kms^{-1}$. హైడ్రోజన్, హీలియం వంటి తేలిక అణువుల సగటు వేగం కూడా 2 నుంచి 3 $kms^{-1}$ ఉండటంతో అవి చంద్రుడి గురుత్వాకర్షణ నుంచి తప్పించుకు పోవడంతో చంద్రుడి ఉపరితలంపై వాతావరణం లేదు. చాలావరకు శూన్యమే!

**పోవాలి – పోకూడదు!:** ఒక వస్తువు భూమాకర్షణ నుంచి దూరంగా పోవాలి. కాని కనిపించకుండా పోకూడదు. భూమ్యాకర్షణకు లోబడి, తిరిగి భూమిని చేరకుండా, కొంత ఎత్తులో మనకు కనపిస్తూ, ఉపయోగపడుతూ ఉండాలి. చంద్రుడిలాగా గురుత్వాకర్షణ శక్తికి లోనై గ్రహం చుట్టూ ఒక నిర్ణీత మార్గంలో తిరుగుతుండే ఆ వస్తువును ఉపగ్రహం (satellite) అంటారు. చంద్రుడు భూమికి సహజ ఉపగ్రహం. ఉపగ్రహం తిరిగే నిర్ణీత మార్గాన్ని కక్ష్య (orbit) అంటారు. భూమికి కొన్ని వందల కిలోమీటర్ల ఎత్తులో ఒక కక్ష్యలో మనం ప్రవేశపెట్టే ఉపగ్రహాలను కృత్రిమ ఉపగ్రహాలు అంటారు. అవి అక్కడ నుంచే మనకు కావాల్సిన సమాచారాన్ని పంపిస్తాయి.

**రోదసీ యుగం:** మన దేశం మొట్టమొదటిసారిగా 1975లో 'ఆర్యభట్ట' ఉపగ్రహాన్ని రోదసిలోకి పంపింది. 1982లో ఇన్‌సాట్-1ఎ, 1983లో ఇన్‌సాట్-1బి ఉపగ్రహాలను కూడా ప్రయోగించింది. టెలికమ్యూనికేషన్ వ్యవస్థ, వాతావరణ సూచనలు, టెలివిజన్ కార్యక్రమాల ప్రసారాలు, భూమి ఆకారం, పరిమాణం తెలుసుకోడానికి, ఖనిజ సంపదలు గుర్తించడానికి, నక్షత్రాలు, గెలాక్సీలు తోకచుక్కల వంటివాటిని పరిశోధించడానికి కృత్రిమ ఉపగ్రహాలు ఉపయోగపడుతున్నాయి.

**ప్రయోగించేది ఎలా?:** వాతావరణ ఘర్షణ వల్ల ఉపగ్రహం మండి పోకుండా, రాకెట్ సహాయంతో ఉపగ్రహాన్ని భూమి వాతావరణానికి దూరంగా కొన్ని వందల కిలోమీటర్ల ఎత్తుకు తీసుకువెళ్లి అక్కడ నుంచి భూమికి సమాంతరంగా ప్రయోగిస్తారు. ఉపగ్రహం రాకెట్ నుంచి విడిపోయిన తర్వాత దానికి తగినంత వేగాన్ని అందిస్తారు. దీనిని కక్ష్యావేగం (orbital velocity) $V_b$ అంటారు. కక్ష్యావేగం $V_b = \sqrt{gR}$. భూమి నుంచి కృత్రిమ గ్రహాన్ని రోదసిలోకి పంపాలంటే కక్ష్యా వేగం కనీసం సెకనుకు 8 కిలోమీటర్లు ఉండాలి. ఈ వేగం కూడా ఉపగ్రహం ద్రవ్యరాశి, ఆకారంపై ఆధారపడి ఉండదు.

**శ్రీహరికోటే ఎందుకు?:** భూమి సూర్యుడి చుట్టూ తిరగడంతో పాటు పడమర నుంచి తూర్పునకు తన చుట్టూ తాను పరిభ్రమిస్తుంటుంది. ఈ పరిభ్రమణ వేగం ధ్రువాల నుంచి భూమధ్య రేఖకు వెళ్లేకొద్దీ పెరుగుతుంది. ఉపగ్రహాలను కూడా భూమధ్యరేఖకు దగ్గరగా ఉండే ప్రదేశం నుంచి పడమర నుంచి తూర్పు దిశకు ప్రయోగిస్తే భూపరిభ్రమణ వేగం ఉపగ్రహ వేగానికి జత కలుస్తుంది. మన రాష్ట్రంలో బంగాళాఖాతం తీరంలోని శ్రీహరికోట భూమధ్యరేఖకు దగ్గరగా ఉంది. 170 చదరపు కిలోమీటర్ల వైశాల్యంతో ప్రజల నివాస ప్రాంతాలకు దూరంగా ఉంది. అక్కడ వీచే గాలి తీవ్రత, దిశ రాకెట్లకు ఎక్కువ ఘర్షణ కలిగించవు. రోదసిలో ప్రవేశపెట్టిన ఉపగ్రహాలను తిరిగి కిందికి తీసుకురావడానికి సముద్రంలో దింపడం చాలా సులభం. నీరు ఇచ్చే ప్లవనశక్తి ఉపగ్రహం భూమిపై దిగే భారాన్ని తేలిక పరుస్తుంది. ఈ కారణాల వల్ల ఉపగ్రహ ప్రయోగాలకు 'లాంచింగ్ స్టేషన్'గా శ్రీహరికోట అనువైన ప్రదేశం.

**భూస్థావర ఉపగ్రహం (Geo Stationary Satellite):** కక్ష్యలోకి పంపిన ఉపగ్రహం ప్రయోగించిన దేశానికి ఉపయోగపడాలంటే భూమి తిరుగుతున్నప్పటికీ అది ఆదేశంపై స్థిరంగా ఉండాలి. ఇలా ఉండే ఉపగ్రహాన్ని భూస్థావర ఉపగ్రహం అంటారు. భూపరిభ్రమణ వేగంతో సమానంగా ఉపగ్రహం కూడా అదే దిశలో భూమి చుట్టూ పయనిస్తే అది భూమి మీద నిలకడగా ఉన్నట్లు కన్పిస్తుంది. దీనిని 'పార్కింగ్ కక్ష్య' అంటారు. భూమి నుంచి 36,000 కి.మీ. ఎత్తులో ఈ కక్ష్య ఉంటుంది. ఇక్కడ ఉపగ్రహ వేగం సెకనుకు 3.1 కిలోమీటర్లు. కక్ష్య వ్యాసార్ధం 42,000 కిలోమీటర్లు.

ప్రముఖ శాస్త్రవేత్తలు విక్రమ్ సారాభాయ్, సతీష్ థావన్‌లు భారతదేశాన్ని రోదసీయుగం (space age) లోకి నడిపించారు.

(రచయిత అనుభజ్ఞులైన లెక్చరర్. కాలమిస్ట్, పాఠ్యపుస్తక రచనలో భాగస్వామి.)

# What is convergence?

TILL SOME time back phones, radios, computers and TVs had operated independently as they had distinct and separate technologies and networks. According to the Telecom Regulatory Authority of India, major technological changes that have facilitated the convergence processes are digitisation and computerisation. Digitisation opened new possibilities for development and creation of services within and beyond the framework of traditional communication sectors.

The developments in hardware and software have empowered digital signal processing to such an extent that with use of IP technology in information transmission, the networks and customer premises equipment could introduce hitherto unknown applications and services. Computerisation has made available data processing capabilities, which can be applied for storage, transmission and distribution of television content and phone calls. This is leading to death of distance and fundamental changes in the business plans of existing telecom and video services providers. The International Telecom Union, the world body for standards and operating discipline in the field of telecommunications, has a five-point definition for convergence:

(i) Integration of customer end terminal equipment/ access devices such as the telephone, television and personal computer.

(ii) Provision of various communication services such as text, data, image, multimedia and video over the existing infrastructure or over a single transmission medium.

(iii) Capability of the same technology to offer various services.

(iv) Different services under a converged licensing regime.

(v) Fixed mobile substitution/convergence.

S.D.

**Large telescopes optically linked**

Optical fibres were used to link two large telescopes into a giant 'interferometer,' to combine light waves to make precise images and measurements.

**Magnetic logic**

According to *Science*, scientists have constructed a universal logic gate with magnetic nanostructures that may move researchers closer to a new generation of microelectronics.



# Towards air-breathing rockets

## Using scramjet technology will enhance the payload capability and reduce the cost

THE INDIAN Space Research Organisation (ISRO) added another feather to its cap when it successfully tested the use of oxygen moving at a speed of Mach 6 — six times the speed of sound — in laboratory conditions to produce a stable supersonic combustion lasting for a few seconds.

Put in a nutshell, the organisation has tested the scramjet (supersonic combustion ramjet) technology that uses air moving at supersonic speed (Mach 6) for ignition. The speed of sound is 750 km per second and is called Mach 1. Anything beyond Mach 1 is considered supersonic. Ramjets, on the other hand, use air at subsonic speed (below Mach 1) for ignition.

### Joining the elite club

With this, India has joined the elite club comprising a handful of nations that are working on mastering the technology. The U.S., Japan, China, Russia, Australia, and some countries in Europe, according to an ISRO press release, are working on scramjet technology. But none, except the U.S., has tested it in an experimental flight.

Using oxygen present in the atmosphere to burn the fuel is nothing new — all fighter planes with turbojet engines use this technology. The fuel carried by these engines is ignited by air compressed using fans. The expanding gases after compression are directed towards the rear to propel the planes forward.

Conventionally, rockets carry oxygen and fuel and do not depend on oxygen present in the atmosphere to burn the fuel. That is because rockets, unlike fighter planes fitted with turbojets, move at a very high speed, and using oxygen at such high speeds is a challenging task; fighter planes with turbojet engines attain speeds in the range of Mach 2-2.5.

### Stable combustion

"Our achievement is not just reaching Mach 6 but being able to produce stable combustion at such a high velocity for a few seconds," said B.N. Suresh, Director of the Thiruvananthapuram based Vikram Sarabhai Space Centre (VSSC). "It's like lighting a matchstick in a hurricane condition."

To be more precise, the ...evement is not just lighting ...chstick in a hurricane con... but also sustaining the ...r the entire duration of ...on.



**OXYGEN FACTOR:** *Unlike conventional launch vehicles, those using scramjet technology will need a more horizontal trajectory.* – ISRO

ISRO's achievement was in a laboratory environment. The air velocity was simulated to reach Mach 6 at entry conditions and combustion produced by supplying hydrogen fuel. It next plans to test the technology in a sounding rocket by mid 2007.

### Greater thrust achieved

Using air breathing scramjet technology has many advantages. "Rockets using liquid fuel will have a specific impulse of 300 seconds (thrust generated by burning 1 kg of propellant in 1 second) and cryogenic fuel will have 440-450 seconds compared with 2500-3000 seconds with scramjet," Dr. Suresh explained.

"So compared with cryogenic, scramjet propulsion has significant advantage in enhancing the payload capability with cost advantage."

Greater the thrust, the lesser the propellant that needs to be carried. Scramjet powered rocket utilising oxygen available in the atmosphere can thus reduce the amount of oxygen to be carried on board considerably.

Oxygen accounts for nearly 60 per cent of the propellant's weight in a rocket. Rockets would thus become lighter and smaller or can carry more payload.

Dr. Suresh does not wish to commit himself at this stage regarding the quantum of weight reduction that can be achieved. "There will be weight reduction. But how much would depend on the configuration and systems that would be used," he said.

### Cost advantage

There is a definite cost advantage when using the air breathing scramjet technology. "The cost reduction will be substantial," is all Dr. Suresh likes to say at this stage.

For all its advantages, air-breathing rockets have to still use conventional fuels to reach an acceleration of Mach 6 before scramjet technology can take over.

### Oxygen availability

Another issue is the availability of oxygen. Oxygen is limited to the atmosphere and is dense in the 10-20 km region. "It is best to use [scramjet] optimally at this height," Dr. Suresh underlined.

One would be crossing the denser region of the atmosphere beyond 40-45 km. As a rule, thinning of oxygen is seen as we go higher up the atmosphere.

Oxygen availability in the atmosphere will per force require some changes in the trajectory of the launch vehicle.

### Change in trajectory

While a nearly vertical trajectory followed by rockets is possible when oxygen is carried on board, the use of scramjet will necessitate a more horizontal trajectory.

"The trajectories have to be redesigned to allow the launch vehicles [rockets] to be in the atmosphere for longer periods," Dr. Suresh explained.

Longer trajectories in the atmosphere have their own share of problems. "About 2200-2800 Kelvin temperature will be produced [when the rocket is in the atmosphere at higher velocities for longer periods].

"So thermal problems would arise and we need to find solutions for these [problems]," he noted. "We are mastering the technology [to overcome these problems]."

Using scramjet technology becomes all the more important as ISRO has set its eyes on re-launch vehicles (rockets that can be reused). "We are ultimately looking at re-launch vehicles [where we can use this technology]," he noted.

So when does ISRO plan to use scramjet technology in launch vehicles? Dr. Suresh is unwilling to specify a target date. "Let us go step by step," he said, "It is not wise to specify any date now." Sources at ISRO, however, say that it would take 7-10 years before it could ever be used in launch vehicles.

# పరాధీన పరిజ్ఞానం మనకెందుకు?

8.4.06

జన్యు మార్పిడి సాంకేతిక పరిజ్ఞానానికి వ్యతిరేకంగా ప్రపంచ వ్యాప్తంగా పర్యావరణవేత్తలు, రైతు సంఘాలు, వినియోగదారులు ఉద్యమిస్తున్నారు. వందన శివ వంటి పర్యావరణవేత్తలు, స్వచ్ఛంద సంస్థలు దేశవ్యాప్తంగా 'జి.ఎం- రహిత', 'పేటెంట్ రహిత' గ్రామాలను ఆవిష్కరించనున్నారు. ఒక జీవంలోని జన్యువును ఇంకొక జీవంలోకి ప్రవేశపెట్టి జన్యుమార్పిడి చేసే ప్రక్రియే జన్యు మార్పిడి సాంకేతిక పరిజ్ఞానం. ఇది అత్యంత వేగవంతంగా విస్తరిస్తోంది. ఒక్కసారి జన్యు మార్పిడి చేసిన జీవిని నియంత్రించటం అసాధ్యమని పర్యావరణవేత్తలంటున్నారు. ఈ నేపథ్యంలో రైతులు, వినియోగదారులు జన్యు మార్పిడి పంటలపైన, ఆహార ఉత్పత్తులపైన అవగాహన పెంచుకోవడం అవసరం. జన్యుమార్పిడి పంటలవల్ల లబ్ధి పొందేదెవరు? ఈ పంటలు పండించే రైతులా, వాటిని వినియోగించే ప్రజలా? లేక వాటిమీద మేధోసంపత్తి హక్కులు కల్గిగిన వ్యవసాయ జీవ సాంకేతిక సంస్థలా?

మోన్‌శాంటో, సింజెంటా, డ్యూపాంట్, అవెంటిస్, మిత్సుబిషి వంటి బహుళజాతి సంస్థలు వ్యవసాయ బయోటెక్ రంగాన్ని శాసిస్తున్నాయి. అసలు ప్రపంచ వాణిజ్య సంస్థ (డబ్ల్యు.టి.ఒ.)లోని మేధోసంపత్తి హక్కులను ఈ సంస్థలే తమకు అనుకూలంగా మలచుకొని డబ్ల్యు.టి.ఒ.లో చేర్పించగలిగాయి. ఈ అయిదు క్రిమిసంహారక బహుళజాతి సంస్థలే 500 కోట్ల డాలర్ల ప్రపంచ జన్యు మార్పిడి విత్తనాల మార్కెట్‌ను శాసిస్తున్నాయి. మోన్‌శాంటో, డ్యూపాంట్‌లు 43 శాతం వ్యవసాయ జీవ సాంకేతిక పేటెంట్లను కలిగి ఉన్నాయి. ఈ రెండు కంపెనీలు ప్రపంచ జన్యుమార్పిడి విత్తనాల మార్కెట్‌లో 83 శాతం వాటాను కలిగి ఉన్నాయి. మోన్‌శాంటో ప్రపంచ మొక్కజొన్న విత్తన మార్కెట్‌లో 41 శాతాన్ని, సోయా చిక్కుడు విత్తన మార్కెట్‌లో 30 శాతం వాటా కలిగి ఉంది. ఇక సింజెంటా టెర్మినేటర్, ట్రెయిటర్ టెక్నాలజీ (విత్తన జీవ ప్రక్రియను నియంత్రించే టెక్నాలజీ) పేటెంట్లలో 45 శాతం వాటా కలిగి ఉంది.

ప్రజలకు జన్యుమార్పిడి విత్తనాలపై సరైన అవగాహన లేదు. ఒక్కసారి జన్యు మార్పిడి విత్తనాలను అనుమతించాక ఆ ఉత్పత్తులను ఏ ఆటంకమూ లేకుండా అమ్ముకోవచ్చు మనం తినే ఆహారం జన్యు మార్పిడి చేసిందో కాదో, అది సురక్షితమైన ఆహారమో కాదో తెలుసుకునే అవకాశం లేదు. జన్యు మార్పిడి ఆహారంతో వచ్చే పరిణామాలను మనం ఊహించలేం. అసలు జన్యు మార్పిడి ఆహార ఉత్పత్తులను ఎలా నివారించుకోవాలో వినియోగదారులకు తెలియదు. జన్యు మార్పిడి పంటలపై ప్రజలకు అవగాహన పెరిగేకొద్దీ ప్రపంచవ్యాప్తంగా వాటిపట్ల వ్యతిరేకత పెరుగుతోంది. పర్యవసానంగా జన్యుమార్పిడి చేసిన ఆహార ఉత్పత్తులకు మార్కెట్ తగ్గిపోతోంది. 45 శాతం జన్యుమార్పిడి మొక్కజొన్న పండిస్తున్న అమెరికా రైతులు ఐరోపా సమాఖ్య మార్కెట్‌ను పూర్తిగా కోల్పోయారు. అమెరికా సోయా రైతులు కూడా 55 శాతం ప్రపంచ సోయా మార్కెట్‌ను కోల్పోయారు. జన్యుమార్పిడి పంటలతో అమెరికా తీవ్రంగా నష్టపోతోంది. జన్యుమార్పిడి పంటల వల్ల అమెరికా సాలీనా మూడు బిలియన్ డాలర్ల ఎగుమతి సబ్సిడీలను అదనంగా ఇవ్వవలసిన అవసరం ఏర్పడింది.

స్విట్జర్లాండ్‌లో జన్యుమార్పిడి పంటలను పూర్తిగా నిషేధించారు. ఐరోపా సమాఖ్య కూడా జన్యుమార్పిడి పంటల దిగుమతిని నిషేధించింది. ఐరోపా సమాఖ్యలోని దేశాల్లో 172 స్థానిక ప్రభుత్వాలు ఆ పంటలను, వాటి దిగుమతులను పూర్తిగా నిషేధించాయి. అటు రష్యా జన్యుమార్పిడి పంటల పరిశోధనపై పూర్తి నిషేధం విధించింది. అమెరికాలోని అనేక స్థానిక ప్రభుత్వాలు ఈ పంటలను నిషేధించాయంటే ప్రపంచవ్యాప్తంగా ఈ టెక్నాలజీ పట్ల ఎంత వ్యతిరేకత పెరుగుతోందో అర్థమవుతోంది. జన్యు మార్పిడి పంటల విస్తరణవల్ల భారత్ వంటి వ్యవసాయాధారిత దేశాలు తీవ్రంగా నష్టపోతాయి. ఇప్పటికే అధిక రసాయన అవశేషాలున్నాయని మిర్చి వంటి అనేక మన వ్యవసాయ ఎగుమతులను యూరోపియన్ యూనియన్ సహా అనేక దేశాలు తిరస్కరించాయి. ఇప్పుడు జన్యు మార్పిడి పంటల విస్తరణ వల్ల మన వ్యవసాయ ఉత్పత్తులను అంతర్జాతీయ మార్కెట్లు పూర్తిగా తిరస్కరించే అవకాశం ఉంది.

సమస్యలు సృష్టించి వాటికి పరిష్కారం చూపటం ఈ సాంకేతిక విజ్ఞానం విశిష్ట లక్షణం. క్రిమిసంహారక, కలుపునాశక మందులను తట్టుకొని మనగలిగే పంటలను జన్యుమార్పిడి చేయటం ద్వారా వ్యవసాయ బయోటెక్ కంపెనీలు అటు వ్యవసాయ రసాయనాల మార్కెట్లను, ఇటు జన్యుమార్పిడి విత్తనాల మార్కెట్‌ను విస్తరించుకోవచ్చు. మోన్‌శాంటో అమెరికాలోని సోయా చిక్కుడు రైతులకు మొదట క్రిమిసంహారక, కలుపునాశక మందులను అందించింది. ఈ రసాయనాల అధిక వినియోగంవల్ల అసలు పంటకే నష్టం రావటంతో, మోన్‌శాంటో విషపూరితమైన మందులను తట్టుకొని మనగలిగే కొత్తరకం సోయా విత్తనాలను జన్యు మార్పిడి చేసి ఇటు విత్తనాలను, అటు రసాయనాలను రైతులకు అమ్మి తన మార్కెట్‌ను విస్తరించుకోగలిగింది. ఈ టెక్నాలజీలు భారత్ వంటి వ్యవసాయాధారిత దేశాలకు ఏ విధంగా శ్రేయస్కరంకాదు.

జన్యు మార్పిడి పంటలవల్ల పర్యావరణ సమతౌల్యం దెబ్బతింటుంది. ఈ టెక్నాలజీ ప్రకృతిని విధ్వంసం చేసి సహజ జీవరాశులను, వంగడాలను కలుషితం చేస్తుంది. వీటివల్ల అనాదిగా మన రైతాంగం పెంపొందించిన స్థానిక స్వజాతి వంగడాలు సహజత్వాన్ని కోల్పోయి జన్యుపరంగా కలుషితమవుతాయి. మొక్కజొన్న ఉద్భవించిన మెక్సికోలో 1998 నుంచి జన్యు మార్పిడి మొక్కజొన్నను పూర్తిగా నిషేధించారు. కానీ అక్కడ స్వజాతి మొక్కజొన్న వంగడాలన్నీ కలుషితమైపోయాయని అధ్యయనాలు తెలుపుతున్నాయి. ఈ సాంకేతిక పరిజ్ఞానం వల్ల జీవరాసులకు అవసరమైన జీవన వైవిధ్యాన్ని, జన్యువైవిధ్యాన్ని మనం కోల్పోయే అవకాశం ఉంది. ఈ వినాశం శాస్త్రవేత్తలు చెప్పినదానికన్నా వేగంగా జరుగుతోంది.

ఈ సాంకేతిక పరిజ్ఞానం వల్ల అనేక కొత్త ఆరోగ్య సమస్యలు ఉత్పన్నమయ్యే ప్రమాదం ఉంది. జన్యు మార్పిడి ఆహార వినియోగంవల్ల రోగనిరోధకశక్తి తగ్గి కొత్తరకమైన ఎలర్జీలు పెరుగుతాయని అధ్యయనాలు తెలుపుతున్నాయి. కీటకాలను నాశనంచేసే విషపూరిత జన్యువులు కలిగిన జన్యుమార్పిడి వంగడాలను వినియోగించటంవల్ల అవి మానవ శరీరంలోకి ప్రవేశిస్తున్నాయి. ఇక యాంటీ బయోటిక్ రెసిస్టెంట్ జీన్స్ మానవ శరీరంలోనికి ప్రవేశించటంవల్ల ఇప్పుడు వాడుకలో ఉన్న యాంటి బయాటిక్స్ నిష్ప్రయోజనమై ఇంకా కొత్త యాంటీ బయాటిక్స్‌ను అభివృద్ధిపరచవలసిన అవసరం ఏర్పడుతుంది. జన్యుమార్పిడి పంటలతో అనేక హానికరమైన పరిణామాలున్నందువల్ల వాటిని తిరిగి క్షుణ్ణంగా అధ్యయనం చేయాలని, ప్రస్తుతం ఉన్న చట్టాలను తిరిగి సమీక్షించాలని భారతీయ వైద్య పరిశోధన మండలి (ఐ.సి.ఎం.ఆర్.) సూచిస్తోంది.

అభివృద్ధి చెందుతున్న దేశాల్లో ఆహార లోపాన్ని నివారించటానికి ఈ టెక్నాలజీని అనుసరించటం సరైనది కాదు. ఇందుకు గోల్డెన్ రైస్ చక్కని ఉదాహరణ. వైరస్ నుంచి, బాక్టీరియానుంచి 'ఎ' విటమిన్ జన్యువులను వరిలో ప్రవేశపెట్టి 'గోల్డెన్' రైస్‌ను రూపొందించారు. దానికి అంతర్జాతీయ పేటెంట్ కూడా పొందారు. కాని గోల్డెన్ రైస్ ద్వారా ఒకరోజుకు కావల్సిన ఎ విటమిన్ పొందాలంటే ఒక మనిషి అయిదు కిలోల బియ్యాన్ని తినవలసి ఉంటుంది. దీన్నిబట్టి ఇది ఎంత హాస్యాస్పదమైన టెక్నాలజీయో అర్థమౌతుంది. ఇక రానున్న రోజుల్లో జంతువుల నుంచి సంగ్రహించిన ప్రొటీన్లను కూడా వరిలో కూర్చే ప్రయత్నాలు జరుగుతున్నాయి. అంటే ఈ సాంకేతిక పరిజ్ఞానం ప్రజలకు కూరగాయలను, పప్పు ధాన్యాలను శాశ్వతంగా దూరం చేయనుంది. పండించిన పంటలకే గిట్టుబాటు ధరలు లేని పరిస్థితుల్లో అధిక పెట్టుబడులతో జన్యు మార్పిడి పంటలను ప్రోత్సహించడం ఆత్మహత్యా సదృశమే.

భారత వ్యవసాయ శాస్త్రజ్ఞులు ఇప్పటికే 3500 పైగా అధిక దిగుబడి వంగడాలను దిగ్విజయంగా రూపొందించారు. వాటి ద్వారా దేశం ఆహార స్వయం సమృద్ధిని సాధించింది. అత్యధిక సబ్సిడీలతో మనగలుగుతున్న అమెరికా వ్యవసాయ రంగం నుంచి మనం నేర్చుకోవాల్సిందేమీ లేదు. అమెరికా జీవ సాంకేతిక పరిజ్ఞానంతో రూపొందించిన జన్యుమార్పిడి పంటలను మనం దిగుమతి చేసుకోనవసరంలేదు. మన ప్రభుత్వాలు స్థానిక స్వజాతి విత్తనాలను అభివృద్ధిపరచి మెరుగైన ఉత్పత్తి విధానాన్ని ప్రోత్సహించాలి. ఉత్తరాంచల్, మేఘాలయ రాష్ట్రాలు సేంద్రియ వ్యవసాయ విధానాన్ని అవలంబించాయి. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు సేంద్రియ వ్యవసాయాన్ని ప్రోత్సహించి, వినాశకర సాంకేతిక పరిజ్ఞానాన్ని, విత్తనాలను నిషేధించాలి. ప్రజల ఆహార ప్రజాస్వామ్యాన్ని, సార్వభౌమాధికారాన్ని కాపాడాలి.

– డాక్టర్ కె. క్రాంతికుమార్‌రెడ్డి

ఇంటర్ జువాలజీ (సెకండ్ ఇయర్)

# కొత్త జన్యురూపాల సృష్టి



ఎంబి తిలక్

**జెనెటిక్ ఇంజినీరింగ్ అనే పదం చాలా మందికి తెలిసిందే. ఈ జెనెటిక్ ఇంజినీరింగ్ ద్వారా జన్యు స్వభావంలో మార్పులు, చేర్పులు చేయడానికి వీలవుతుంది. ఆ కోవకు చెందినదే rDNA టెక్నాలజీ. ఈ ప్రక్రియ ద్వారా ప్రకృతిలో అరుదుగా లభించే అమూల్యమైన ప్రోటీన్‌లు, పదార్థాలను నియంత్రించే DNA కాపీలను రూపొందించవచ్చు. కొత్త జన్యురూపాలను సృష్టించవచ్చు.**

### rDNA అంటే ఏమిటి?

rDNA అంటే రికాంబినెంట్ DNA. దీన్నే ఖైమెరిక్ DNA అని కూడా పిలుస్తారు. ఖైమెరా అనేది గ్రీకు పురాణంలో కనిపించే రాకాసిజీవి. సింహం తల, మేక శరీరం, పామునుతోకగా కలిగిన విచిత్ర రూపం. అదే విధంగా రెండు వేర్వేరు రకాలకు చెందిన DNA తంతువులతో రూపొందించిన DNA ను ఖైమెరిక్ DNA అంటారు.

rDNA టెక్నాలజీలో అనేక రకాల ఎంజైమ్‌లను ఉపయోగిస్తారు. అవి రిస్ట్రిక్షన్ ఎండోన్యూక్లియేజ్‌లు, ఎక్సోన్యూక్లియేజ్‌లు, లైగేజ్‌లు, అల్కలీన్ ఫాస్ఫటేజ్‌లు

**రిస్ట్రిక్షన్ ఎండోన్యూక్లియేజ్‌లు:** ఇవి అణు కత్తెరల్లాగా పనిచేస్తాయి. రిస్ట్రిక్షన్ ఎండోన్యూక్లియేజ్‌లు DNA లోని నత్రజని క్షారాల పాలిండ్రోం వరుసలను గుర్తించి నిర్దిష్ట ప్రాంతాల్లో ముక్కలుగా కత్తిరిస్తాయి. కుడి నుంచి ఎడమ వైపు, ఎడమ నుంచి కుడివైపు చదవడానికి వీలున్న పదాలను పాలిండ్రోమ్‌లు ('వికటకవి' లాంటి పదాలు). నత్రజని క్షారాల వరసలు జిగురుకొసల్లో పాలిండ్రోం అమరికను చూపుతాయి. పాలిండ్రోం వరసలో నాలుగు నుంచి ఆరు నత్రజని క్షారాల జతలు ఉంటాయి. వీటిని రెండు సమానార్ధ భాగాలుగా విభజించే రేఖను సౌష్ఠవరేఖ అంటారు.

సౌష్ఠవరేఖ ద్వారా కత్తిరించినప్పుడు మొండి చివరలు ఉన్న DNA తంతువులు ఏర్పడతాయి. ఎక్కువగా రిస్ట్రిక్షన్ ఎంజైమ్‌లు DNA లోని ఒక పోగును సౌష్ఠవాక్షానికి కుడివైపున కత్తిరించగా, రెండో పోగును సౌష్ఠవాక్షానికి ఎడమవైపు నుంచి కత్తిరిస్తుంది. దీని వల్ల ఏకపోచ కొసలు ఏర్పడతాయి. వీటిని జిగురు కొసలు లేదా కొహెసివ్ అంత్యాలు అంటారు. ఈ విధంగా ఏర్పడిన డిఎన్ఎ జిగురు కొసలు ఒకదానికొకటి సంపూరకంగా ఉంటాయి.

**ఎక్సోన్యూక్లియేజ్‌లు:** ఇవి DNA తంతువును అంత్యాల వద్ద కత్తిరిస్తాయి. ఫాస్ఫోడై ఎస్టర్ బంధాలను జల విశ్లేషణ చేస్తాయి.

**లైగేజ్‌లు:** రెండు DNA తంతువులను అతికించడానికి ఉపయోగపడే ఎంజైమ్‌లు లైగేజ్‌లు. ఈ విధంగా జతచేసే ప్రక్రియను లైగేషన్ అంటారు.

### వాహకాలు

ఆతిథేయి కణంలోకి వాంఛనీయ DNA ను రవాణా చేసే DNA లను క్లోనింగ్ వెక్టర్లు అంటారు. జన్యు క్లోనింగ్ వెక్టర్లుగా ప్లాస్మిడ్‌లు, బ్యాక్టీరియో ఫేజ్‌లు, కాస్మిడ్‌లను ఉపయోగిస్తారు. ప్రోకేరియోట్ కణాల్లో ఉన్న కేంద్రకేతర, రెండు పోచలున్న వర్తుల DNA లను ప్లాస్మిడ్‌లు అంటారు. ఇవి పరాయి DNA ను బ్యాక్టీరియాలోకి చేర్చగలుగుతాయి.

**ఉదా:** pBR322 ప్లాస్మిడ్

బ్యాక్టీరియాలపై దాడి చేయగల సామర్థ్యం ఉన్న చిన్న వైరస్‌లను బ్యాక్టీరియో ఫేజ్‌లు అంటారు. వీటి DNA వర్తులం లేదా రేఖ రూపంలో ఉంటుంది. బ్యాక్టీరియోఫేజ్ DNA లు ఒకటి లేదా రెండు పోచలను కలిగి ఉంటాయి. లాంబ్డా ఫేజ్, M 13 ఫేజ్ DNA లు క్లోనింగ్ వాహకాలుగా ఉపయోగపడతాయి. లాంబ్డా DNA కాస్ స్థానాలను (cos-sites) కలిగిన కృత్రిమ ప్లాస్మిడ్‌లు కాస్మిడ్‌లు. ఇవి ప్లాస్మిడ్, బ్యాక్టీరియో ఫేజ్ లక్షణాలను రెండింటిని కలిగి ఉన్న సంకర క్లోనింగ్ వాహకాలు. వీటిలోని కాస్ స్థానాలు అతిపెద్ద DNA ను గ్రహించడానికి తోడ్పడగా ప్లాస్మిడ్ DNA ప్రతికృతికి ఉపయోగపడుతుంది.




### రికాంబినెంట్ DNA తయారీ

రికాంబినెంట్ DNA తయారీలో అనేక అంచెలున్నాయి. అవి-

★ క్లోనింగ్ చేయాల్సిన DNA ను గుర్తించి వేరుచేయడం.
★ వాహకాన్ని వేరుపరచడం.
★ ఖైమెరిక్ DNA ను ఏర్పరచడం.
★ ఖైమెరిక్ DNA ను ఆతిథేయి కణంలోకి ప్రవేశపెట్టడం.
★ ఖైమెరిక్ DNA ఉన్న రికాంబినెంట్‌లను గుర్తించి వేరుచేయడం.

**క్లోనింగ్ చేయాల్సిన DNA ను వేరుపరచడం:** క్లోనింగ్ చేయాలనుకున్న రెండు పోగులున్న DNA ను నిర్దిష్ట స్థానాల్లో కత్తిరించడానికి రిస్ట్రిక్షన్ ఎండోన్యూక్లియోజ్‌లను వాడతారు. వీటి కత్తిరింపు వల్ల దాత DNA తునకలు ఏర్పడతాయి. వీటిని జెల్‌ఫోరెసిస్ పద్ధతి ద్వారా వేరుచేస్తారు. సదరన్ బ్లాటింగ్ పద్ధతిని ఉపయోగించి కావాల్సిన జన్యువును గుర్తిస్తారు. ఈ విధంగా వేరుపరిచిన, క్లోనింగ్ చేయాల్సిన జన్యువును దాత DNA అని అంటారు.

**క్లోనింగ్ వాహకాన్ని వేరుచేయడం:** సాధారణంగా క్లోనింగ్ వాహకాలుగా ప్లాస్మిడ్‌లు ఎక్కువగా ఉపయోగపడతాయి. ఈ ప్లాస్మిడ్‌లను కలిగిన బ్యాక్టీరియాలను లైసోజైమ్, ఇథలిన్ డై అమీన్ టెట్రా ఎసిటికామ్లంతో కలిపితే వాటి కణకుడ్యాలు కరిగిపోతాయి. వీటిని సోడియం లారైల్ సార్కొసినేట్ లాంటి ద్రావణంతో చర్య జరుపుతారు. బ్యాక్టీరియా కణాంగాలున్న ఈ ద్రావణాన్ని అల్ట్రాసెంట్రిఫ్యూగేషన్ చేయడం ద్వారా ప్లాస్మిడ్‌లను వేరుచేస్తారు.

**ఖైమెరిక్ DNA ను ఏర్పరచడం:** దాత DNA ను కత్తిరించడానికి ఉపయోగపడిన రిస్ట్రిక్షన్ ఎంజైమ్‌లతోనే క్లోనింగ్ ప్లాస్మిడ్ కత్తిరిస్తారు. ఈ కత్తిరింపు సౌష్ఠవరేఖకు చుట్టూ జరిగినప్పుడు ఏకపోచ జిగురు కొసలు ఏర్పడతాయి. ఇవి ఒకదానితో ఒకటి సంపూరకంగా ఉండి పాలిండ్రోం అమరికను చూపుతాయి. దాత DNA జిగురు కొసలు, వాహక ప్లాస్మిడ్ జిగురు కొసలు కూడా సంపూరకంగా ఉంటాయి. దాత DNA జిగురు కొసలను వాహక జిగురు కొసలతో అతికించడానికి DNA లైగేజ్ ఎంజైమ్ తోడ్పడుతుంది. ఈ విధంగా రెండు లేదా అంతకంటే ఎక్కువ రకాల DNA ల కలయిక వల్ల ఏర్పడిన DNA ను ఖైమెరిక్ DNA లేదా rDNA అంటారు.

**rDNA ను ఆతిథేయికణంలోకి ప్రవేశపెట్టడం:** rDNA ను బ్యాక్టీరియాలోకి ప్రవేశపెట్టే పద్ధతులు ట్రాన్స్‌ఫర్మేషన్, ట్రాన్స్‌డక్షన్. ట్రాన్స్‌ఫర్మేషన్ పద్ధతిలో కాల్షియం క్లోరైడ్‌ను ఉపయోగించి rDNA ను బ్యాక్టీరియల్ కణంలోకి ప్రవేశపెడతారు. మరో పద్ధతిలో బ్యాక్టీరియో ఫేజ్‌లను ఉపయోగించి బ్యాక్టీరియా కణంలోకి rDNAను ప్రవేశపెడతారు. ఈ ప్రక్రియను ట్రాన్స్‌డక్షన్ అంటారు. rDNA ను స్వీకరించిన బ్యాక్టీరియాలను రికాంబినెంట్‌లు లేదా ట్రాన్స్‌జెనిక్ సూక్ష్మజీవులు అని పిలుస్తారు.

**రికాంబినెంట్‌లను గుర్తించడం:** రికాంబినెంట్‌లను జన్యుమార్కర్‌లను ఉపయోగించి లేదా కాలనీ హైబ్రిడైజేషన్ ప్రక్రియల ద్వారా గుర్తిస్తారు. ఈ విధంగా ఏర్పడిన రికాంబినెంట్ బ్యాక్టీరియాలను భారీ సంఖ్యలో పెంచి వాటి నుంచి rDNA ఉత్పత్తి చేసే పదార్థాన్ని సేకరిస్తారు.

(రచయిత హైదరాబాద్ నారాయణ జువాలజీ లెక్చరర్)

# అణువిద్యుత్ పెనుభూతమే!



డాక్టర్ సజ్జల జీవానందరెడ్డి

వివిధ రకాల ఇంధనాలను ఉపయోగించి విద్యుదుత్పత్తి చేయడం మన దేశంలో ఎంతో కాలంగా వాడుకలో ఉంది. బొగ్గు, లిగ్నైట్, సహజవాయువు, నూనెలు, యురేనియం, థోరియం వంటి సంప్రదాయక/ పునఃపూరకం కాని ఇంధన వనరులను ఉపయోగించి విద్యుత్‌ను ఉత్పత్తి చేయడం ఒక పద్ధతి. గాలి, సౌరశక్తి, బయోమాస్, సముద్రపు అలలు వంటి సంప్రదాయేతర/ పునఃపూరక ఇంధన వనరుల సాయంతో విద్యుదుత్పత్తి చేయడం మరో పద్ధతి. ఈ రెండూ కాకుండా జలవిద్యుదుత్పత్తి విధానం కూడా ఉంది. వీటన్నింటిలోనూ బొగ్గు ద్వారా ఉత్పత్తి అయ్యే విద్యుత్తుదే సింహభాగం. 1998-99 గణాంకాల ప్రకారం ఆ ఏడాది మన రాష్ట్రంలో థర్మల్ విద్యుదుత్పాదన 66,665 మెగావాట్లు. ఇది ఆ ఏడాది దేశంలో ఉత్పత్తి అయిన విద్యుత్‌లో 72 శాతం. అదే సమయంలో జలవిద్యుదుత్పత్తి 21,810 మెగావాట్లు. ఇది దేశంలో ఉత్పత్తి అయిన మొత్తం విద్యుత్‌లో 23 శాతం. అణువిద్యుత్ విషయానికివస్తే 1890 మెగావాట్లు మాత్రమే. ఇది మొత్తం విద్యుదుత్పత్తిలో రెండు శాతంకంటే తక్కువ.

## పర్యావరణానికి ప్రమాదం

గాలి, సౌరశక్తి, సముద్రపు అలలు వంటి సంప్రదాయేతర ఇంధన వనరులను ఉపయోగించి విద్యుదుత్పత్తి చేయడంవల్ల ఎలాంటి కాలుష్యం విడుదలకాదు. అందువల్ల పర్యావరణ పరిరక్షణకు హాని ఉండదు. బొగ్గు, లిగ్నైట్, యురేనియం, థోరియం వంటి సంప్రదాయ ఇంధనవనరుల సాయంతో చేసే విద్యుదుత్పత్తివల్ల పర్యావరణానికి హాని కలుగుతుంది. బొగ్గు వంటి కొన్ని రకాల ఇంధనాల వినియోగంవల్ల విడుదలయ్యే కాలుష్యం కొన్ని గంటల నుంచి కొన్ని రోజులపాటు పర్యావరణంపై ప్రభావం చూపిస్తుంది. యురేనియం వంటి ఇంధనాలను ఉపయోగించి విద్యుదుత్పత్తి చేయడంవల్ల వెలువడే కాలుష్య ప్రభావం కొన్నివేల సంవత్సరాలు ఉంటుంది. దీనిని బట్టి చూస్తే యురేనియంను ఉపయోగించి చేసే అణువిద్యుదుత్పత్తివల్ల అనర్థాలు ఎక్కువని స్పష్టమవుతుంది.

గాలి ద్వారా, నీటి ద్వారా, మనం తీసుకునే ఆహారం ద్వారా యురేనియం జీవరాశి శరీర కణాల్లోకి చొచ్చుకుపోయి కణవిభజనపై ప్రభావం చూపిస్తుంది. జన్యు సంకేతాలు సరైన రీతిలో వెలువడకుండా నిరోధిస్తుంది. పర్యావరణంలోని ఇతర రసాయనాలతో యురేనియం సునాయాసంగా కలిసిపోతుంది. దీనివల్ల మూత్రపిండాలకు, ఊపిరితిత్తులకు కేన్సర్ సోకే ప్రమాదం ఉంది. అంగవైకల్యం సంభవించే అవకాశం ఎన్నోరెట్లు ఎక్కువ.

నల్గొండ జిల్లా లంబాపూర్ గ్రామ సమీపాన నాగార్జునసాగర్ రిజర్వాయర్‌కు ఎగువన - నీటిలో యురేనియం శాతాన్ని కనుగొనేందుకు యురేనియం కార్పొరేషన్ ఆఫ్ ఇండియా గతంలో కొన్ని పరీక్షలు నిర్వహించింది. ఇందులో భాగంగా కొన్ని బోరు బావులు కూడా వేసింది. వాటినుంచి సేకరించిన నీటి నమూనాలలో యురేనియం శాతం (లీటరు నీటికి) 2.9 నుంచి 28.6 మిల్లీగ్రాముల వరకూ ఉన్నట్లు తేలింది. తాగు నీటిలో లీటరుకు రెండు మిల్లీగ్రాములకు మించి యురేనియం ఉంటే హానికరమని ప్రపంచ ఆరోగ్య సంస్థ చెబుతోంది. వాస్తవానికి యురేనియం భూమిలో నిక్షిప్తమై ఉన్నంతవరకూ ఎలాంటి ప్రమాదమూ ఉండదు. దానిని వెలికితీస్తే మాత్రం ఇప్పుడు నీటిలో ఉన్నదానికంటే ఎన్నోరెట్లు అధికంగా రేడియోధార్మిక స్థాయిలు పెరుగుతాయి. నాగార్జునసాగర్ వద్ద యురేనియం నిక్షేపాలు ఉన్న ప్రాంతం నుంచి భూగర్భ మురుగునీటి పారుదల వ్యవస్థ సాగర్ రిజర్వాయర్ వైపుగా వెడుతోంది. అంటే సాగర్ నీరు కలుషితమయ్యే ప్రమాదం ఉన్నట్లు తెలుస్తోంది. అదే జరిగితే కోట్లాది మంది అనారోగ్యాల పాలు కావడం ఖాయం. ఈ విషయాలన్నిటినీ దృష్టిలో పెట్టుకుని హైదరాబాద్ మంచినీటి సరఫరా సంస్థ, మురుగునీటి పారుదల బోర్డు కాలుష్యనియంత్రణ మండలికి సమర్పించిన నివేదికలో యురేనియం తవ్వకాలవల్ల సాగర్ నీరు రేడియోధార్మిక కాలుష్యానికి గురవుతుందని పేర్కొంది. కాలుష్య నియంత్రణ మండలి నియమించిన సాంకేతిక నిపుణుల బృందం కూడా సాగర్ పరిసరాల్లో పరిశోధనలు జరిపి - యురేనియం నిక్షేపాల కోసం తవ్వకాలు జరిపితే రేడియోధార్మిక కాలుష్యం పెచ్చరిల్లే ప్రమాదం ఉందని హెచ్చరించింది. పర్యవసానంగా లంబాపూర్ - పెద్దగట్టు ప్రాంతంలో నిర్మించ తలపెట్టిన యురేనియం శుద్ధి కర్మాగారానికి కాలుష్యనియంత్రణ మండలి అనుమతి నిరాకరించింది.

వివాదం సద్దుమణిగిందనుకొంటున్న సమయంలో ఇదే జిల్లాలోని దేవరకొండ మండలం శేరిపల్లి గ్రామ సమీపాన యురేనియం శుద్ధి కర్మాగారం ఏర్పాటుకు ప్రభుత్వం సన్నాహాలు ప్రారంభించడంతో సమస్య మళ్ళీ మొదటికొచ్చింది. లంబాపూర్‌కు చేటుచేసే ప్లాంటు శేరిపల్లికి ఏవిధంగా మేలుచేస్తుంది?

యురేనియంను వెలికితీయడం, తరలించడం, శుద్ధిచేయడం వంటి ప్రక్రియలన్నీ ఎంతో ఖర్చుతో కూడుకున్నవి. భూమిలో నిక్షిప్తమై ఉన్న యురేనియంను వెలికితీసేందుకు భారీగా పేలుడు పదార్థాలను ఉపయోగించవలసి ఉంటుంది. వెలికితీసిన యురేనియంను శుద్ధికర్మాగారానికి తరలించేటప్పుడు గాలి, నీరు కలుషితమయ్యే ప్రమాదం ఉంది. భారీ వ్యయప్రయాసలకోర్చి వెలికితీసినా శుద్ధిచేసిన అనంతరం మిగిలే యురేనియం చాలా తక్కువ. ఉదాహరణకు వెయ్యి టన్నుల యురేనియం ఖనిజాన్ని వెలికితీస్తే వ్యర్థాలు పోను మిగిలేది సుమారు 548 కిలోలు మాత్రమే. ఇక వ్యర్థాలను వదిలించుకోవడమనేది మరో పెద్ద సవాలు. యురేనియం ఖనిజాన్ని శుద్ధిచేసిన తరవాత మిగిలే వ్యర్థాలలో రేడియోధార్మికత ఇంకా మిగిలి ఉంటుంది. అందువల్ల చెత్తను పారవేసినట్లు పడేయలేం. ఒక టెయిల్ పాండ్‌ను తవ్వి అందులో వ్యర్థాలను భద్రపరచాలి. ఈ వ్యర్థాలు మామూలు వాతావరణంలోకి ప్రవేశించకుండా కనీసం పాతికేళ్లపాటు తగిన జాగ్రత్తలు తీసుకోవలసి ఉంటుంది. వ్యర్థాలను భద్రపరిచిన టెయిల్ పాండ్ వల్ల కాలుష్యం ప్రబలే ప్రమాదం ఉంది. సాంకేతిక పరిజ్ఞానం అభివృద్ధి చెందేంతవరకు యురేనియం వ్యర్థాలను ఇలా టెయిల్ పాండ్‌లలో నిక్షిప్తం చేయడమొక్కటే మార్గం. కానీ, భూకంపాలు వంటి విపత్తులు సంభవించినపుడు ఈ వ్యర్థపదార్థాలు బయటపడితే జరిగే నష్టం ఊహించడానికి కూడా వీలుకాదు. ఇక అణువిద్యుత్ కర్మాగారాలకు ప్రమాదం వాటిల్లితే ఏమవుతుందనడానికి రష్యాలోని చెర్నోబిల్, అమెరికాలోని త్రీమైల్ ఐలాండ్ వంటి అణుకర్మాగారాలలో జరిగిన ప్రమాదాలు ఉదాహరణ.



నల్గొండ జిల్లాలో యురేనియం వెలికితీత యోచనపై మరోమారు ప్రజాగ్రహం పెల్లుబికింది. యురేనియం వ్యతిరేక ఉద్యమకారులు మంగళవారం నల్గొండలో ప్రదర్శన నిర్వహించి, ఈ ప్రాజెక్టు వద్దంటూ నినదించారు. ఈ నేపథ్యంలో అణు విద్యుత్ ఏ రకంగానూ ఉపయోగకరం కాదని, పైగా దీనివల్ల అనర్థాలే అధికమని పేర్కొంటున్న వ్యాసమిది.

అణు విద్యుదుత్పత్తి విషయానికొస్తే విద్యుత్ తయారీకి అవుతున్న ఖర్చును మాత్రమే విద్యుదుత్పత్తి వ్యయంగా చూపిస్తున్నారు. యురేనియంను వెలికితీయడం, శుద్ధిచేయడం, వ్యర్థాలను భద్రపరచడం, కాలపరిమితి ముగిసిన అణువిద్యుత్ ప్లాంట్లను ప్రమాదరహితంగా మూసివేయడం, ఇతర దేశాల నుంచి దిగుమతి చేసుకుంటున్న సాంకేతిక పరిజ్ఞానం వంటి వాటికి విద్యుత్ వ్యయం కింద చూపిస్తున్న దానికంటే ఎన్నో వందల రెట్లు ఎక్కువ ఖర్చు అవుతోంది. కానీ, ప్రస్తుతం తయారీని మినహాయించి మిగతా అన్ని దశలకూ ప్రభుత్వం సబ్సిడీ అందజేస్తోంది. అందువల్ల ఈ లెక్కలు వెలుగుచూడటంలేదు. యురేనియం నిక్షేపాలను వెలికితీసేందుకు అయ్యే వ్యయంలో సగం మొత్తాన్ని ప్రభుత్వం సబ్సిడీగా అందచేస్తోంది. యురేనియం శుద్ధికి, వ్యర్థపదార్థాల పరిరక్షణకు, ఇతర దేశాల నుంచి సాంకేతిక పరిజ్ఞానాన్ని పొందడం వంటి వాటికి నూరుశాతం సబ్సిడీని ఇస్తోంది.

## విదేశాల్లో విముఖత

అణు విద్యుత్ కేంద్రాల పట్ల ప్రపంచ దేశాలు ఒకప్పుడు కనబరిచిన ఆసక్తిని ఇప్పుడు చూపడంలేదు. వీటివల్ల కలిగే ప్రయోజనాలకంటే కష్టనష్టాలు ఎక్కువగా ఉండటమే ఇందుకు కారణం. 1978 తరవాత అమెరికా మరో అణువిద్యుత్ కేంద్రం నిర్మాణానికి పూనుకోలేదు. కొత్తగా అణువిద్యుత్ కేంద్రాలను నిర్మించరాదని బెల్జియం, స్వీడన్, జర్మనీ చట్టాలు రూపొందించుకున్నాయి. కెనడా గత యాభయ్యేళ్లలో అణువిద్యుత్ కేంద్రాలపై ఖర్చు చేసిన మొత్తం దాదాపు 1700 కోట్ల డాలర్లు. యురేనియం శుద్ధికి అమెరికా భారీగా సబ్సిడీ ఇస్తోంది. ప్రస్తుతం ఆ దేశంలో ఉన్న అణువిద్యుత్ కేంద్రాలను వాటి కాలపరిమితి ముగిశాక మూసివేసేందుకు 3,300 కోట్ల డాలర్లు వ్యయమవుతాయని అంచనా.

దీర్ఘకాలిక ప్రయోజనాల దృష్ట్యా అణువిద్యుత్ కేంద్రాల స్థాపన ఎంతమాత్రం అభిలషణీయం కాదు. ఈ విషయంలో ఇతర దేశాలు నిజానిజాలను గుర్తెరిగి మసలుకొంటుంటే, మన ప్రభుత్వం 'ఊరంతా ఒకదారి ఉలిపికట్టెది మరోదారి' అనే రీతిలో వ్యవహరిస్తోంది. అణువిద్యుదుత్పత్తి కోసం భారీ వ్యయం చేసేందుకు సిద్ధపడుతున్న ప్రభుత్వం- ఆ డబ్బును సంప్రదాయేతర ఇంధన వనరుల సాయంతో విద్యుదుత్పత్తి చేసేందుకు ఖర్చుచేస్తే ఎంతయినా మంచిది.

(రచయిత ప్రపంచ వాతావరణ సంస్థ ముఖ్య సాంకేతిక సలహాదారుగా పనిచేశారు.)

ఈనాడు

# ... వైరస్ చిత్తు!

కంప్యూటర్లకు సోకే వైరస్‌ల బలమంతా వాటి వేగం మీదే ఆధారపడుతుంది. కొత్తగా వ్యాపిస్తున్న వైరస్‌ను కనుగొని దానిని అడ్డుకునేలోపే అది కొన్ని లక్షల కంప్యూటర్లను చేరుతుంది. అంటే, జరగాల్సిన నష్టం జరిగిపోయాకే నివారణ చర్యలు మొదలవుతాయన్న మాట. వైరస్‌లకున్న ఈ ప్రధాన బలాన్ని దెబ్బతీయాలంటే యాంటీవైరస్ సాఫ్ట్‌వేర్‌లు వాటికంటే వేగంగా వ్యాపించి కంప్యూటర్లలో రక్షణ కవచాన్ని నిర్మించాలి. ఇజ్రాయెల్‌లోని టెల్అవీవ్ విశ్వవిద్యాలయానికి చెందిన ఎరాన్ షిర్ ఆయన సహచర బృందం చేసిన ప్రతిపాదన ఇదే. వైరస్‌లను ఎదుర్కొనేందుకే కొన్ని కంప్యూటర్లను ఏర్పాటు చేసి వాటి ద్వారా ఇంటర్‌నెట్‌లో ఉన్న అన్ని కంప్యూటర్లకు రక్షణను అందించాలన్నది ఆ పథకం.

## పని చేసేదిలా!

'హానిపాట్' పేరుతో కొన్ని కంప్యూటర్లు ఉంటాయి. ఇవి ఇంటర్‌నెట్ అంతటా అక్కడక్కడా వ్యాపించి ఉంటాయి. వీటి లక్ష్యం వైరస్‌లను ఎదుర్కోవటమే. ఈ హానిపాట్‌లన్నీ ఒక రక్షిత నెట్‌వర్క్‌లో అనుసంధానమవుతాయి. ఈ నెట్‌వర్క్‌ను ఏ వైరస్ కూడా ఏమీ చేయలేనిస్థాయిలో రూపొందిస్తారు. అయితే, కంప్యూటర్‌లపై దాడికి దిగే వైరస్‌కు హానిపాట్ కూడా మామూలు కంప్యూటర్‌లానే కనిపిస్తుంది. అక్కడికి వైరస్ చేరుకోగానే క్షణాల్లో దానిలో ఉన్న ప్రోగ్రామ్‌ను హానిపాట్ విశ్లేషిస్తుంది. మరోవైపు వైరస్ చేరుకున్న సమాచారం నెట్‌వర్క్‌లో ఉన్న ఇతర హానిపాట్‌లన్నింటికీ చేరిపోతుంది. ఇవి కూడా ఆ వైరస్‌ను నిర్వీర్యపరిచే కార్యక్రమాన్ని వెంటనే చేపడతాయి. ప్రతీ హానిపాట్ ఒక రక్షణకేంద్రంగా పని చేయటం ప్రారంభిస్తుంది. వాటినుంచి యాంటీవైరస్ కోడ్ వేగంగా ఇంటర్‌నెట్‌లో ఉన్న కంప్యూటర్లను చేరిపోతుంది. అంటే, వైరస్ ఆయా కంప్యూటర్లను చేరకముందే దానిని అడ్డుకునే కోడ్ కంప్యూటర్ల వద్ద ఉంటుంది. ఇక ఎటూపోలేక ఆ వైరస్ బిక్కచచ్చిపోవలసిందే.

## 'బ్లాస్టర్'తో మొదలైన ఆలోచన

రెండేళ్ల క్రితం ఇంటర్‌నెట్ ప్రపంచాన్ని వణికించిన బ్లాస్టర్ వైరస్ కారణంగానే ఎరాన్‌షిర్ దృష్టి ఈ రంగంపై పడింది. యాంటీవైరస్ సాఫ్ట్‌వేర్లు బ్లాస్టర్ వేగాన్ని అందుకోలేకపోవటం షిర్‌ను ఆలోచనలో పడేసింది. అప్పటి నుంచి మొదలైన ఆయన పరిశోధన చివరికి హానిపాట్ నెట్‌వర్క్ రూపాన్ని తీసుకుంది.

## సంఖ్య పెరిగితే ఫలితం ఎక్కువ

ఎరాన్‌షిర్ బృందం తమ ఆలోచనను కంప్యూటర్ సిమ్యులేషన్ ద్వారా పరీక్షించి చూసింది. హానిపాట్‌ల సంఖ్య ఎంత ఎక్కువగా ఉంటే వైరస్‌ల బారి నుంచి అంత ఎక్కువ సంఖ్యలో కంప్యూటర్లను కాపాడటానికి వీలవుతుందని దీనిలో తేలింది. ఉదాహరణకు, ఒక నెట్‌వర్క్‌లో 50వేల కంప్యూటర్లు ఉన్నాయనుకుందాం. వాటిలో 0.4 శాతం కంప్యూటర్లను హానిపాట్లుగా మార్చి అనుసంధానం చేస్తే అవి 95 శాతం కంప్యూటర్లకు రక్షణను కల్పిస్తాయి. అదే 200 మిలియన్ల కంప్యూటర్ల నెట్‌వర్క్‌లో (అమెరికాలో ఉన్న కంప్యూటర్ల సంఖ్య) అదే 0.4 శాతం కంప్యూటర్లను హానిపాట్లుగా మారిస్తే... అవి 99.999 శాతానికి వైరస్‌ల నుంచి రక్షణనిస్తాయి. ఎరాన్‌షిర్ దీని గురించే వ్యాఖ్యానిస్తూ... "ఒక్కో కంప్యూటర్‌కు యాంటీవైరస్ సాఫ్ట్‌వేర్‌ను అందించే ప్రస్తుత కార్యక్రమానికి ఇది భిన్నం. మొత్తం నెట్‌వర్క్ అంతటినీ వైరస్ దుర్భేద్యంగా మార్చటమే మా ప్రయత్నం." అంటున్నారు. ప్రస్తుతం తమ ప్రతిపాదనలకు కార్యరూపం ఇచ్చే ప్రయత్నాల్లో ఉన్నారు ఆయన. తమ ఐడియాను ఓపెన్‌సోర్స్ పద్ధతిలో అభివృద్ధిపరిచి అందరికీ అందుబాటులో ఉంచుతామని, వాణిజ్యపరం చేసే ఆలోచన లేదని షిర్ పేర్కొన్నారు.

ఈనాడు సోమవారం అక్టోబరు 3, 2005



# ఇంధన రంగానికి నవజీవం!

**అంతర్జాతీయ మార్కెట్లో అంతకంతకూ పెరిగిపోతున్న చమురు ధరలు అనేక దేశాల ఆర్థిక వ్యవస్థలను అతలాకుతలం చేస్తున్నాయి. చమురునే నమ్ముకుంటే చేతి చమురు వదలడం ఖాయమని తేలిపోయింది. మరి, ప్రత్యామ్నాయం ఏమిటన్నది ప్రశ్న. పునఃపూరక జీవ ఇంధనాలు అన్నది దానికి సరైన సమాధానం. అపార సహజసంపద కలిగిన భారతదేశానికి ఈ రంగంలో ముందుకు దూసుకెళ్లేందుకు ఇప్పుడో అపూర్వ అవకాశం లభించింది. దానిని ఇండియా సద్వినియోగం చేసుకోవాలంటున్న వ్యాసమిది.**



జయప్రకాష్‌నారాయణ్

అమెరికాను తుపాను 'కత్రినా' ఇటీవల విధ్వంసం సృష్టించిన దరిమిలా ఇంధన సమస్యపై దృష్టి కేంద్రీకరించాల్సిన ఆవశ్యకత ఏర్పడింది. ప్రపంచం అత్యధికంగా చమురుపైనే ఆధారపడుతోంది. అన్ని దేశాల భవిష్యత్తు చమురుతో ముడిపడిపోయింది. దాంతో- చమురు రంగంలో ఆటుపోట్లు ఆయా దేశాల ఆర్థిక వ్యవస్థలను అతలాకుతలం చేస్తున్నాయి.

చమురు ధరలు ఇటీవలి వారాల్లో బ్యారెల్‌కు 70 డాలర్లు మించిపోయాయి. గ్యాసోలిన్ ధరలూ అంతే. గ్యాలన్ గ్యాసోలిన్ ధర షికాగోలో నాలుగు డాలర్లకు, అట్లాంటాలో ఐదు డాలర్లకు చేరుకుంది. రోజుకు 8 కోట్ల 25 లక్షల బ్యారెళ్ల చమురు ఖర్చవుతోంది. ఒక రోజులో శుద్ధిచేసిన ఆయిల్ అంతా అదే రోజు వినియోగం కావడం- చమురు ప్రధాన ఇంధన వనరుగా మారాక ఇదే మొదటిసారి. ప్రపంచ వ్యాప్తంగా చమురు ఉత్పత్తి సామర్థ్యం గత 20 ఏళ్లలో ఎన్నడూ లేనంత తక్కువ స్థాయికి- రోజుకు 10 నుంచి 20 లక్షల బ్యారెళ్లకు పడిపోయింది. కత్రినా వంటి ప్రకృతి విపత్తుల కారణంగా ప్రపంచ చమురు సరఫరాలో నాలుగు శాతం దెబ్బతిన్నా, ముడి చమురు ధర బ్యారెల్‌కు 160 డాలర్లకు చేరుకోగలదంటూ అమెరికా జాతీయ ఇంధన విధాన సంఘం అంచనా వేసింది. ఇందులో ఆశ్చర్యపడాల్సిందేమీ లేదు. తీవ్ర స్థాయి ఉగ్రవాద దాడుల్లో ఒపెక్ దేశాల్లోని కీలక చమురు వ్యవస్థలు ధ్వంసమైతే ధరలు పట్టపగ్గాలు లేకుండా పెరుగుతాయి. ప్రపంచ ఆర్థిక రంగంపై తీవ్ర దుష్ప్రభావం పడుతుంది.

## దిగుమతులు ఎన్నాళ్లు?

ప్రపంచ ఆర్థిక వ్యవస్థ విచిత్ర పరిస్థితిని ఎదుర్కొంటోంది. గత రెండు దశాబ్దాల్లో- ముఖ్యంగా వర్ధమాన దేశాల్లో బ్రహ్మాండమైన ఆర్థిక వృద్ధి నమోదైంది. అదే సమయంలో చమురు అవసరం అనూహ్య స్థాయిలో పెరిగింది. దాంతో అంతకులంత సరిపోయింది. లాభం, నష్టం లేని పరిస్థితి ఏర్పడింది. ఒకవైపు వృద్ధి- మరోవైపు మాంద్యం; ఇటు అవకాశాలు- అటు సంక్షోభాలు; ఆ వంక ఆశలు- ఈ వంక భయాలు... ఇంతకుముందెప్పుడూ ఇలా జరగలేదు.

చమురుకు లోకం దాసోహమైపోయింది. ఇది బహుళార్థ సాధకం కావడం, సునాయాసంగా ఉపయోగించే వీలుండటం ఇందుకు కారణాలు. గ్యాసోలిన్‌ను ఉపయోగించే మోటారు కారు ఎందరికో ఇష్టమైన రవాణా సాధనంగా రూపుదాల్చింది. ఆటోమొబైల్ పరిశ్రమ, ప్రపంచంలోని ప్రముఖ పరిశ్రమగా రూపొందింది. అమెరికాలోని ప్రధాన ఆటోమొబైల్ కంపెనీల వారు కార్ల అమ్మకంలో ముందుకు దూసుకెళ్లేందుకు ప్రకటనలతో హోరెత్తిస్తున్నారు. పూర్తిగా రుణంపై కార్లు ఇస్తున్నారు. ముందుగా ఏమీ చెల్లించనక్కర్లేదు. రుణంపై వడ్డీ కూడా ఉండదు. మొదటి సంవత్సరం ఒక్క వాయిదా కూడా కట్టనక్కర్లేదు. భారతదేశంలోని కొన్ని కంపెనీలు కూడా ఆ అడుగుజాడల్లోనే నడుస్తున్నాయి. దీంతో మోటారు వాహనాల ఉత్పత్తి బాగా పెరుగుతోంది. 2007 నాటికి దేశంలో ఏటా కోటి మోటారు వాహనాలు ఉత్పత్తి అయ్యే అవకాశం ఉంది. ఏడా[...]కి 10 లక్షల కొత్త కార్లు, రవాణా వాహనాలు, దాదాపు 50 [...]ల ద్విచక్ర వాహనాలు అమ్ముడవుతున్నాయి. ప్రస్తుతం వెయ్యిమందిలో ఎనిమిది మంది మాత్రమే కార్లు కలిగి[...]. ప్రభుత్వ రవాణా వ్యవస్థ అధ్వాన పరిస్థితిలో ఉన్న[...]చ్చే రెండు దశాబ్దాల్లో కార్ల అమ్మకాలు గణనీయంగా [...]చనలు ఉన్నాయి. దాంతోపాటే చమురు అవస[...]గం కూడా బాగా పెరుగుతాయి.

[...]లో చమురు డిమాండ్ ఏటా 10 శాతం పెరు[...]లో మొత్తం 11 కోట్ల 40 లక్షల టన్నుల [...]కాగా, అందులో 76 శాతాన్ని 2600 కోట్ల [...]గుమతి చేసుకున్నారు. ఇటీవల చమురు ధరలు చుక్కల్ని తాకాయి. సరఫరాలో అవరోధం ఏర్పడుతుందేమోనన్న భయ సందేహాలు తలెత్తాయి. దిగుమతులపై అధికంగా ఆధారపడవలసివస్తోంది. ఇదంతా తీవ్ర ఆందోళన కలిగిస్తోంది. వివిధ ఇంధన అవసరాలు తీర్చడానికి చమురు వంటి బహుళార్థ సాధక వనరు మరొకటి సమీప భవిష్యత్తులో మనకు అవసరం. చమురు దిగుమతులపైనే ఆధారపడటాన్ని తగ్గించుకోవాలి. ఇందుకోసం ఏమి చేయాలన్నది ఆలోచించాలి. పునఃపూరక ఇంధనాలను గుర్తించి, పెద్దయెత్తున ఉత్పత్తి చేయాల్సిన అవసరం ఉంది. భవిష్యత్ ఇంధనంగా హైడ్రోజన్ ఆధారిత ఇంధన కణ సాంకేతిక ప్రక్రియ ఇప్పటికే మోతెక్కిపోతోంది. సౌర, తరంగ, పవన విద్యుత్తు వంటి పునఃపూరక ఇంధన వనరుల వల్ల లాభం కన్నా నష్టమే అధికం. వీటి ఉత్పత్తికి ఖర్చు ఎంతో ఎక్కువ. సరైన సాంకేతిక పరిజ్ఞానం కూడా అందుబాటులో లేదు. పైగా, ఈ ఇంధనాలను నిల్వచేసుకోలేం. మనకు ఇష్టమైన రీతిలో ఉపయోగించుకోలేం. ఇక- సౌర విద్యుత్తు సంగతి! సూర్యుడే నమ్మకమైన ఇంధన వనరు అని నోబెల్ బహుమతి పొందిన భౌతిక శాస్త్రవేత్త జార్జిపోర్టర్, ఇతర శాస్త్రజ్ఞులు ఎన్నో ఏళ్లుగా వాదిస్తున్నారు. పచ్చని మొక్కలు కిరణజన్య సంయోగక్రియ ద్వారా సూర్యరశ్మిని ఉపయోగించుకొని ఇంధనాన్ని చౌకగా ఉత్పత్తి చేయగలవని వారు అంటున్నారు. ఇప్పుడు మనం వినియోగిస్తున్న బొగ్గు, చమురు నిక్షిప్తమైన వృక్ష ఉత్పత్తులే. అవి కొన్ని లక్షల ఏళ్లుగా పరివర్తనం చెంది నేడు మనం ఉపయోగించుకొంటున్న ఇంధన రూపాలను సంతరించుకొన్నాయి. ఈ విషయాన్ని మరవరాదు.

**భవిష్యత్తే భారతం**

కిరణజన్య సంయోగక్రియ సామర్థ్యాన్ని జెనిటిక్ ఇంజనీరింగ్ ద్వారా ఇప్పటి రెండు శాతం నుంచి దాదాపు నాలుగు శాతానికి పెంచవచ్చు అలా చేయడంవల్ల రవాణా, విద్యుత్తు, పరిశ్రమతో సహా అన్ని రకాల అవసరాలకు సరిపడినంతగా చౌకగా, సమృద్ధిగా పునఃపూరక బహుళార్థసాధక జీవఇంధనాలు (బయోఫ్యూయెల్స్) పొందవచ్చు ఈ స్వప్నం సాకారం కావడానికి కొంత సమయం పట్టవచ్చు కానీ, మన రవాణా అవసరాలకు సరిపడినంతగా చమురు ప్రత్యామ్నాయాలను ఉత్పత్తిచేసే సాంకేతిక ప్రక్రియ, పద్ధతులు ఇప్పటికే మన వద్ద ఉన్నాయి. ప్రపంచ భూవిస్తీర్ణంలో భారత్ వాటా 2.5 శాతమే. కానీ మొత్తం వ్యవసాయ భూమిలో దాదాపు 12 శాతం మనదేశంలోనే ఉండటం గమనార్హం. ఈ నేపథ్యంలో మనముందు మూడు అత్యుత్తమ మార్గాలు ఉన్నాయి. చక్కెరలను పులియబెట్టడం ద్వారా ఇథనాల్‌ను ఉత్పత్తి చేయడం, జత్రోఫా కర్కస్ వంటి మొక్కల నుంచి బయోడీజిల్‌ను తయారు చేయడం, జన్యు నిర్మిత ఎంజైములను ఉపయోగించుకోవడం ద్వారా సెల్యులోజ్ వంటి బయోమాస్ అంతటికీ ఇథనాల్ తదితర ఇంధనాలుగా మార్చడం... ఇవీ మన ముందున్న దారులు. బయోమాస్‌ను వాణిజ్య తరహాలో పూర్తిగా పరివర్తనం చేయడానికి మూడు నుంచి ఐదేళ్లు పడతాయి. కానీ మొక్కల చక్కెరల నుంచి తీస్తున్న ఇథనాల్, నూనెల నుంచి తీస్తున్న బయోడీజిల్ ఇప్పటికే వాణిజ్య తరహాలో చలామణిలో ఉన్నాయి.

ఈ రకమైన పునఃపూరక ఇంధనాలను భారత్, బ్రెజిల్, మలేసియా, ఇండొనేసియా బాగా ఉత్పత్తి చేయగలుగుతాయి. ఈ దేశాలు సారవంతమైన నేలలను కలిగి ఉన్నాయి. కావలసినంత సూర్యరశ్మి లభిస్తుంది. ఏడాది పొడవునా పంటలు పండించే వీలుంది. ఇవీ ఇందుకు కారణాలు. బ్రెజిల్ ఇప్పటికే ఈ రంగంలో ముందుకు దూసుకెళ్లిపోతోంది. ఆ దేశం చెరకు నుంచి రోజుకు 1400 కోట్ల లీటర్ల ఇథనాల్‌ను ఉత్పత్తి చేస్తోంది. రెండు లక్షల బ్యారెళ్ల గ్యాసోలిన్‌కు అది సమానం. 22 శాతం ఇథనాల్ కలిపిన ఇంధనాన్నే అన్ని మోటారు వాహనాలు ఉపయోగించాలని బ్రెజిల్‌లో అమలులో ఉన్న చట్టం నిర్దేశిస్తోంది. 20 శాతం వాహనాలు కేవలం ఇథనాల్‌నే వాడుతున్నాయి. పైపెచ్చు ఇథనాల్ ధర చాలా తక్కువ. బ్యారెల్‌కు 25 డాలర్లే. బ్రెజిల్‌లో చేపట్టిన ఈ కార్యక్రమం వల్ల కొత్తగా 10 లక్షల మందికి ఉద్యోగాలు లభించాయి. మూడు దశాబ్దాల్లో మొత్తం చమురు దిగుమతి ఖర్చు 6000 కోట్ల డాలర్ల మేరకు (2000 నాటి ధరల ప్రకారం) తగ్గింది. ఈ కార్యక్రమంపై పెట్టిన మొత్తం పెట్టుబడికన్నా ఇది పది రెట్లు ఎక్కువ. మొదట్లో ఇచ్చిన సబ్సిడీలకన్నా 50 రెట్లు ఎక్కువ. ఈ ఇంధనాన్ని బ్రెజిల్‌లోని ప్రభుత్వ చమురు కంపెనీ పెట్రోబ్రాస్ తప్పని సరిగా కొంటోంది. వ్యవసాయ-పారిశ్రామిక ఇథనాల్ సంస్థలకు తక్కువ వడ్డీపై రుణాలు ఇస్తున్నారు. గ్యాసోలిన్ ధర రూపాయి ఉంటే, దీని ధర 59 పైసలే. ఈ ధర ఎప్పుడూ పెరగదు. ఇలాంటి చర్యలు చేపట్టడంవల్లే ఈ ఇంధన ప్రాచుర్యం బాగా పెరిగిపోయింది. ఇథనాల్ ఇంధనం తయారీకి ఐదుశాతం వ్యవసాయ భూమినే ఉపయోగించుకొంటున్నప్పటికీ దాదాపు 25 శాతం గ్యాసోలిన్ వినియోగదారులు ఈ ఇంధనంవైపు మళ్లడం విశేషం.

## కార్యాచరణ కీలకం

మనదేశం విషయానికివస్తే జీవఇంధనాల (బయోఫ్యూయెల్) అభివృద్ధిపై ఏర్పాటుచేసిన కమిటీ 2003లో తన నివేదిక సమర్పించింది. 2900 కిలోలీటర్ల ఇథనాల్‌ను ఉత్పత్తి చేసే సామర్థ్యం ప్రస్తుతం మనకు ఉందని, ఇంధనంలో ఐదు శాతం కలిపితే పన్నెండో ప్రణాళిక వరకు అది సరిపోతుందని ఆ కమిటీ తెలిపింది. కోటీ పన్నెండు లక్షల హెక్టార్ల మేరకు నిస్సారమైన, పనికిరాని భూములు, తెరపులు ఉన్న అడవులు, సాగుయోగ్యమైన ఖాళీ భూముల్లో జత్రోఫా మొక్కలు పెంచాలని కమిటీ సిఫారసు చేసింది. ఇలా చేస్తే- వచ్చే దశాబ్దం నాటికి గ్యాసోలిన్‌లో 20 శాతం ఇథనాల్‌ను డీజిల్‌లో 20 శాతం బయోడీజిల్‌ను కలిపే స్థాయికి భారత్ సునాయాసంగా చేరుకోగలదు. ఇలాంటి మార్పు తేవాలంటే- సరైన విధానాలను అనుసరించాల్సి ఉంటుంది. తగినన్ని పెట్టుబడులు పెట్టాల్సి ఉంటుంది. అంతేకాదు- పన్ను రాయితీలు ఇవ్వాలి. జీవ ఇంధనాల కోసం వ్యవసాయ పరంగా సబ్సిడీలు ఇవ్వాలి. ప్రాసెసింగ్ సామర్థ్యం పెంచాలి. మౌలిక సదుపాయాలు కల్పించాలి. టెక్నాలజీ, డిస్టిలరీల్లో పెట్టుబడులు పెట్టాలి. బై-బ్యాక్ ఏర్పాట్లు చేయాలి. ఇథనాల్, బయోడీజిల్‌లను తప్పని సరిగా కొనేలా చూడాలి. మొలాసిస్, జీవ ఇంధనాల తయారీపై ఆంక్షలు ఎత్తివేయాలి. పరిశోధన, అభివృద్ధి కార్యక్రమాలకు ఊతం ఇవ్వాలి. ఇలాంటి ఇంధనాలవల్ల ఎన్నో ప్రయోజనాలు కలుగుతాయి. ఇంధన భద్రత ఏర్పడుతుంది. తక్కువ ఖర్చులో ఇంధనం లభిస్తుంది. విదేశ మారకద్రవ్యం ఆదా అవుతుంది. మొక్కలు వాతావరణంలోని కార్బన్‌డయాక్సైడ్‌ను పీల్చుకొంటాయి కనుక మొత్తం మీద కార్బన్‌డయాక్సైడ్ తదితర ఉద్గారాలు తగ్గుతాయి. వ్యవసాయ దిగుబడులకు డిమాండ్ పెరగడంతో వ్యవసాయం తిరిగి పుంజుకొంటుంది. భూసారానికి రక్షణ చేకూరుతుంది. సుస్థిరవృద్ధి సాధ్యపడుతుంది. తప్పనిసరిగా గమ్యానికి చేర్చే మార్గమిది. ఇలాంటి మార్గాలు ప్రపంచం ముందు ఇప్పుడు చాలా తక్కువగా ఉన్నాయి. చమురు దిగుమతులపై ఎక్కువగా ఆధారపడరాదని భావిస్తున్న ప్రపంచ దేశాలు ఇప్పుడు ఈ మార్గంలోనే పయనిస్తున్నాయి. ఎంతో సహజ సంపద కలిగి ఉన్న భారతదేశానికి ఇది గొప్ప అవకాశం. ఇక కార్యాచరణే ఆలస్యం.

(రచయిత లోక్‌సత్తా, 'జట్ ఇండియా'ల సమన్వయకర్త)

# పవన విద్యుత్తే ఆశాకిరణం




**కేంద్రంలోని యు.పి.ఎ. ప్రభుత్వం మొన్న మేలో ఏడాదికాలం పూర్తి చేసుకొన్నప్పుడు కొన్ని కీలక నిర్ణయాలు తీసుకొంది. సంప్రదాయేతర ఇంధన వనరులపై ప్రత్యేక దృష్టి సారించాలన్నది వాటిలో ఒకటి. పునఃపూరణ (రెన్యువబుల్) ఇంధన వనరుల ద్వారా 2012 నాటికి దేశంలో అదనంగా పదిశాతం విద్యుత్తును ఉత్పత్తి చేయాలన్నది సంప్రదాయేతర ఇంధన వనరుల మంత్రిత్వశాఖ లక్ష్యం. ఏటా ఆగస్టు 20న, రాజీవ్‌గాంధి జయంతి నాడు 'రాజీవ్ పునఃపూరణ ఇంధన (రెన్యువబుల్ ఎనర్జీ) దినోత్సవం' జరుపుకోవడం ద్వారా ఈ లక్ష్యసాధన దిశలో సాగిపోవాలన్నది ప్రభుత్వ సంకల్పం. రాష్ట్రపతి అబ్దుల్ కలాం కూడా మొన్న స్వాతంత్ర్య దినోత్సవ సందేశంలో ఇంధన రంగంలో స్వావలంబన ఆవశ్యకతను నొక్కి చెప్పారు. ఈ నేపథ్యంలో దేశమంతటా నిరంతర, నిరంతరాయ విద్యుత్ వెలుగులను ప్రసరింపజేయడంలో పవన విద్యుత్తు తోడ్పడగలదని పేర్కొంటున్న వ్యాసమిది...**

సంప్రదాయేతర ఇంధన వనరుల్లో అతి ప్రాచీనమైనది పవనశక్తి. వేల సంవత్సరాల కిందటే నెదర్లాండ్స్‌లో నీటిని తోడేందుకు గాలి మరలను ఉపయోగించేవారు. పవనశక్తి నుంచి విద్యుత్తు ఉత్పత్తి ప్రక్రియను మూడు దశాబ్దాలుగా ప్రపంచంలోని పలు దేశాలు చేపడుతున్నాయి. మన దేశంలోనూ పాతిక సంవత్సరాలుగా పవనశక్తి నుంచి విద్యుదుత్పత్తిని కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ప్రోత్సహిస్తున్నాయి.

గాలి నుంచి విద్యుత్తును ఉత్పత్తి చేసే సాధనాన్ని విండ్ టర్బైన్ అంటారు. ఇందులో టవర్, జనరేటర్ ఉండే నాసిల్, రెక్కలు ఉంటాయి. గాలి వీచినప్పుడు రెక్కలు తిరిగి గేర్ల సహాయంతో జనరేటర్ ద్వారా విద్యుత్తు ఉత్పత్తి అవుతుంది. ఈ విద్యుత్తును గ్రిడ్‌కు అనుసంధానం చేస్తారు. విండ్ టర్బైన్ రెక్కలు తిరిగేందుకు అవసరమైన అతి తక్కువ గాలివేగాన్ని కట్ ఇన్ స్పీడ్ అంటారు. విండ్ టర్బైన్ ఉత్పత్తి చేసే గరిష్ఠ విద్యుత్తును రేటెడ్‌స్పీడ్ అంటారు. సాధారణంగా కట్ ఇన్ స్పీడ్ సెకనుకు నాలుగు మీటర్లు, రేటెడ్ స్పీడ్ సెకనుకు 15 మీటర్లు ఉంటాయి. గాలి వేగానికి, పవర్‌కు క్యూబిక్ సంబంధం ఉండటం వల్ల విండ్ టర్బైన్లు నెలకొల్పే ప్రదేశాల్లో గాలివేగం అధికంగా ఉండాలి. ఒక కేంద్రం వద్ద గాలి వేగం సెకనుకు ఆరు మీటర్ల నుంచి పదిమీటర్లు పెరిగిందనుకొందాం... అప్పుడు సదరు పవన విద్యుదుత్పత్తి కేంద్రంలో ఉత్పత్తి అయ్యే విద్యుత్తు 130 శాతం పెరుగుతుంది. ఒక మెగావాట్ పవన విద్యుత్తు కేంద్రం నెలకొల్పేందుకు 20 ఎకరాల స్థలం అవసరం. ఇందుకయ్యే వ్యయం సుమారు నాలుగుకోట్ల రూపాయలు.

నూరుశాతం డిప్రిసియేషన్, క్యాపిటల్ సబ్సిడీ, థర్డ్ పార్టీసేల్, సేల్స్ ట్యాక్స్ మినహాయింపుల రూపంలో పవనవిద్యుత్తుకు రాయితీలిస్తున్నారు. ఈ రాయితీల్లో కొన్నింటిని మాత్రమే వివిధ రాష్ట్ర ప్రభుత్వాలు అమలు చేస్తున్నాయి. మన దేశంలో తమిళనాడు రాష్ట్రం పవన విద్యుత్తు ఉత్పత్తిలో అగ్రగామిగా నిలిచింది. 2005 మార్చి చివరినాటికి తమిళనాడులో 2,036.9 మెగావాట్ల విద్యుత్తును పవన విద్యుత్తు కేంద్రాలద్వారా ఉత్పత్తి చేస్తున్నారు. దేశం మొత్తంమీద 3,595 మెగావాట్ల పవన విద్యుత్తు ఉత్పత్తి అవుతోంది. గత ఏడాది దేశం మొత్తంమీద పవన విద్యుత్తు ఉత్పత్తి కేంద్రాల్లో 1,111 మెగావాట్ల ఉత్పత్తి జరిగితే, అందులో 675 మెగావాట్ల విద్యుత్తు ఒక్క తమిళనాడులోనే ఉత్పత్తి అయింది. దీన్నిబట్టి ఆ రాష్ట్రప్రభుత్వం పవన విద్యుత్తుకు ఇస్తున్న ప్రాధాన్యాన్ని అర్థంచేసుకోవచ్చు అదే సమయంలో మన రాష్ట్రంలో 22 మెగావాట్ల పవన విద్యుత్తును మాత్రమే ఉత్పత్తి చేయడం విచారకరం.

మన దేశంలో పవన విద్యుదుత్పత్తికి ఎన్నో అవకాశాలున్నా, తమిళనాడు మినహా మిగతా రాష్ట్రాల్లో ప్రగతి ఆశించినంతగా లేదు. స్థల సేకరణలో జాప్యం, అన్ని రాష్ట్రాల్లో సమానమైన ఆర్థిక ప్రోత్సాహకాలు లేకపోవటం తదితర కారణాలు వీటికి ఆటంకంగా ఉంటున్నాయి.

గతంలో విండ్ టర్బైన్లు చాలా చిన్నవిగా (15- 20 మీటర్ల వ్యాసం, 50- 100 కిలోవాట్ల సామర్థ్యం) ఉండేవి. ప్రస్తుతం మన దేశంలో పెద్దవైన విండ్ టర్బైన్ బ్లేడ్ల వ్యాసం 80 మీటర్లు, పరిమాణం 2 మెగావాట్లు. పెద్ద విండ్ టర్బైన్లను నెలకొల్పేందుకు కావలసిన స్థలం కూడా తక్కువ.

1990లో జర్మనీలో పవన విద్యుత్తు కేంద్రాలను నెలకొల్పటం ప్రారంభించారు. అనతికాలంలోనే జర్మనీ ఈ విషయంలో ప్రపంచంలోనే అగ్రగామిగా నిలిచింది. ప్రస్తుతం జర్మనీలో 16,628 మెగావాట్ల విద్యుత్తును పవన విద్యుత్తు కేంద్రాల ద్వారా ఉత్పత్తి చేస్తున్నారు. అణు విద్యుత్ ఉత్పత్తిలో ఎంతో ముందుకు దూసుకు వెళ్లిన జర్మనీ సైతం పవన విద్యుత్తుపై దృష్టి కేంద్రీకరించటం విశేషం. పవన విద్యుత్తుకు సముచితమైన కొనుగోలు అవకాశాలు కల్పించటం ఈ రంగంలో జర్మనీ ఆధిక్యతకు కారణం. స్పెయిన్ 8,263 మెగావాట్లు, అమెరికా 6,752 మెగావాట్లు, డెన్మార్క్ 3,118 మెగావాట్ల పవన విద్యుత్తును ఉత్పత్తి చేస్తున్నాయి. ప్రపంచంలో పవన విద్యుత్తులో మనదేశం నాలుగో స్థానంలో ఉంది.

మన రాష్ట్రంలో దాదాపు రెండు దశాబ్దాల కిందట విండ్ టర్బైన్లను నెలకొల్పినా విద్యుదుత్పత్తి ఆశాజనకంగా లేదు. కేవలం 120.6 మెగావాట్ల పవన విద్యుత్ ఉత్పత్తిని మాత్రమే సాధించగలిగాం. అనంతపురం, కర్నూలు, నెల్లూరు, చిత్తూరు జిల్లాల్లోని కొన్ని ప్రాంతాలు పవన విద్యుత్తు కేంద్రాల ఏర్పాటుకు అనుకూలం. ఇప్పటికే రామగిరి, కడవకల్లు, కొండమీదపల్లి, నరసింహకొండ, తిరుమలల్లో పవన విద్యుత్తు కేంద్రాలు పనిచేస్తున్నాయి. నెల్లూరు జిల్లాలోని నరసింహకొండపై 2.5 మెగావాట్ల పవన విద్యుత్తు కేంద్రం పనిచేస్తోంది. నరసింహకొండపై నెలకొల్పిన విండ్‌మాస్ట్ (గాలి వేగాన్ని, దిశను కొలిచే సాధనం) ఆధారంగా ఈ ప్రదేశంలో పవర్ లా ఇండెక్స్ (ఎత్తు పెళ్లేకొద్దీ గాలివేగం పెరిగే సూచిక) హెచ్చుగా ఉండటం వల్ల ఇక్కడ పెద్ద విండ్ టర్బైన్లు నెలకొల్పితే అధిక పవన విద్యుత్తును పొందవచ్చు నెల్లూరు జిల్లాలోని ఉదయగిరి, సంగం, వెంకటగిరి, రాపూరు ప్రాంతాల్లో కేంద్ర ప్రభుత్వ అధీనంలోని సంప్రదాయేతర ఇంధన వనరుల మంత్రిత్వశాఖ వారు విండ్‌మాస్ట్‌లను నెలకొల్పితే మరిన్ని పవన విద్యుత్తు కేంద్రాల ఏర్పాటుకు తగిన ప్రాంతాలను గుర్తించవచ్చు

మనదేశంలో కేవలం కొండ ప్రాంతాల్లో పవన విద్యుత్తు కేంద్రాలు నెలకొల్పుతున్నారు. జర్మనీ, డెన్మార్క్, నెదర్లాండ్స్ మొదలైన దేశాల్లో సముద్రంలో అయిదు కిలోమీటర్ల దూరంలో 'ఆఫ్‌షోర్ విండ్ ఫార్మ్స్' నెలకొల్పారు. సముద్రంలో గాలివేగం భూమికంటే దాదాపు 40 శాతం ఎక్కువగా ఉంటుంది. అందువల్ల పెద్ద విండ్ టర్బైన్లను (2 నుంచి 4.5 మెగావాట్లు) నెలకొల్పి వేల మెగావాట్ల పవన విద్యుత్తును ఉత్పత్తి చేస్తున్నారు. మనదేశంలో కూడా తీరప్రాంతాల్లో సమగ్ర వాయు సర్వే జరిపి 'ఆఫ్‌షోర్ విండ్‌ఫార్మ్స్'ను నెలకొల్పగలిగితే పెద్దయెత్తున పవన విద్యుత్తును ఉత్పత్తి చేయవచ్చు

మనదేశంలో ప్రస్తుతం పెద్ద పరిశ్రమలకు మాత్రమే ద్రవ్య ప్రోత్సాహకాలు లభిస్తున్నాయి. అదే డెన్మార్క్‌లో లక్ష కుటుంబాలకు పవన విద్యుత్తు కేంద్రాలో భాగస్వామ్యం ఉంది. డెన్మార్క్‌లో అయిదు లక్షల మంది కో-ఆపరేటివ్ విండ్‌ఫార్మ్స్'లో సభ్యులు. మనదేశంలో కూడా 'సహకార విండ్‌ఫార్మ్స్' నెలకొల్పగలిగితే పవన విద్యుత్తులో ఎంతో ప్రగతి సాధించవచ్చు దేశంలో 'విండ్ ఫండ్'ను ఏర్పాటు చేసి ప్రజలను భాగస్వాములుగా చేయగలిగితే పవన విద్యుత్తు కేంద్రాలు నెలకొల్పేందుకు ఆర్థిక వనరులు సమకూర్చవచ్చు ప్రస్తుతం సేవింగ్స్ బాండ్‌లు, ఎల్.ఐ.సి.లలో పెట్టిన డబ్బుకు ఆదాయపన్ను రాయితీలు కల్పించినట్లే విండ్ ఫండ్‌లో పెట్టిన పెట్టుబడికి కూడా ఆ సదుపాయం కల్పిస్తే సామాన్యులు కూడా పవన విద్యుత్తు కేంద్రాల్లో భాగస్వాములయ్యేందుకు అవకాశం ఉంటుంది. రానున్న కాలంలో దేశంలోని విద్యుదుత్పాదనలో పవన విద్యుత్తు ఉత్పత్తికి అనుబంధ పాత్ర ఎంతైనా ఉందనటంలో సందేహం లేదు.

– డాక్టర్ ఎ.జగదీష్

## -- సేంద్రియ వ్యవసాయంలో కొత్త విధానం --

Sc & Tec

# 'మైకోరైజా'

ఉయ్యూరు: భూసార సంరక్షణలో, భూముల వ్యవసాయ యోగ్యతకు దెబ్బతగలకుండా కాపాడటంలో సేంద్రియ వ్యవసాయం ప్రాధాన్యాన్ని ప్రపంచమంతటా గుర్తిస్తున్నారు. సాధారణంగా ఉపయోగించే పశువుల ఎరువు, సేంద్రియ ఎరువులు, జీవన ఎరువులు (బయోఫెర్టిలైజర్స్)కు తోడుగా తాజాగా ఇప్పుడు 'మైకోరైజా' ముందుకొచ్చింది. మొక్కలకు భాస్వరాన్ని, ఇతర సూక్ష్మపోషకాల్లన్ను అందించే మైకోరైజా తన పెరుగుదలకు, విస్తరణకు అవసరమైన పోషకాలను ఆ మొక్కలనుంచే స్వీకరిస్తుంది.

నేటి పరిస్థితుల్లో వ్యవసాయ రంగంలో మైకోరైజా ఎంతో ప్రాధాన్యాన్ని సంతరించుకుంటున్నది. ప్రపంచ జనాభా పెరిగిపోతూ వున్న స్థితిలో ఆహారపు అవసరాలు పెరుగుతున్నాయి. వాటిని అందించవలసింది వ్యవసాయ ఉత్పత్తులను పెంపొందించడంతోనే. అందుకుగాను, వ్యవసాయం నిరంతరం అభివృద్ధి చెందేదిగా వుండాలి. అయితే, రసాయన ఎరువులను విచక్షణా రహితంగా వరసగా అనేక సంవత్సరాలుగా వాడుతున్నందున వ్యవసాయ భూములు నిస్సారమవుతున్నాయి. వ్యవసాయానికి పనికిరాకుండా పోతున్నాయి. ఈ పరిస్థితులలో భూముల వ్యవసాయ యోగ్యతను కాపాడుకోవాలి. వ్యవసాయ యోగ్యమైన భూ విస్తీర్ణంగా తగ్గిపోకుండా చూసుకోవాలి. ఈ విషయాన్ని సర్వత్రా గుర్తిస్తున్నారు. అందుకు సేంద్రియ ఎరువుల వాడకం, జీవన ఎరువులు (బయోఫర్టిలైజర్స్) వాడకం ప్రాధాన్యం వహిస్తున్నాయి. సేంద్రియ వ్యవసాయ పద్ధతులను వ్యాప్తి చేయడానికి, రసాయన ఎరువుల వాడకాన్ని కొంతమేరకు తగ్గించడానికిగాను తగిన పరిమాణంలో సేంద్రియ ఎరువులను, జీవన ఎరువులను అందించటానికి కృషి జరుగుతోంది. రసాయన ఎరువులను కొంతమేర తగ్గిస్తూ సేంద్రియ, జీవన ఎరువులను వాడటంవల్ల మంచి ఫలితాలు లభిస్తాయి. ఖర్చులు తగ్గుతాయి. నేలకు పెద్దగా హాని జరగదు. భూమి నిస్సారమై వ్యవసాయ యోగ్యతను కోల్పోయే పరిస్థితి దాపురించకుండా నివారించటానికి దోహదపడుతుంది. ఆహార భద్రతకు హామీ ఏర్పడుతుంది.

ఈ లక్ష్య సాధనకై బహుముఖ కృషి సాగుతోంది. పశువుల ఎరువు, సేంద్రియ ఎరువులు, జీవన ఎరువులు వాడతారు. ఆ జాబితాలో తాజాగా చేరింది మైకోరైజా. వ్యవసాయరంగంలో పైర్లకు పోషకాలను సమకూర్చడంలో తోడ్పడటానికి తగిన పరిమాణంలో మైకోరైజాని అందించడం ఎలాగనేదే సమస్యగా ఉండేది. మైకోరైజా వృద్ధి చెందటానికి మొక్కల వేర్లమీదనే అవకాశం ఉంది. కుండీలలో పెంచిన మొక్కల వేరమీదగాని పొలంలో పెరిగే మొక్కల వేర్లమీదగాని దానిని ప్రవర్ధమానం చేయడం కష్టసాధ్యంగా ఉంది. దానిని లేబరేటరీలలో ఉత్పత్తి చేసే టెక్నాలజీ ఇటీవలి వరకూ అందుబాటులో లేదు.

అయితే, టాటా ఎనర్జీ రీసెర్చ్ ఇన్‌స్టిట్యూట్, భారత ప్రభుత్వ బయోటెక్నాలజీ సంస్థ సహకారంతో సాగించిన కృషి ఈ విషయంలో కొత్త వెలుగును ప్రసాదించింది. మైకోరైజాను లేబరేటరీలలో స్టెరయిల్ కండిషన్స్‌లో ఉత్పత్తి చేసే టెక్నాలజీని ప్రపంచం మొత్తం మీద వారే ప్రప్రథమంగా రూపొందించారు. వాణిజ్యస్థాయిలో మైకోరైజాను ఉత్పత్తి చేసేందుకు కె.సి.పి. సుగర్ అండ్ ఇండస్ట్రీస్ కార్పొరేషన్‌వారు టాటా ఎనర్జీ ఇన్‌స్టిట్యూట్‌తో సాంకేతిక పరంగా ఒప్పందం కుదుర్చుకున్నారు.

వెసిక్యూలర్ అర్బస్క్యులర్ మైకోరైజా (ఎండోమైకోరైజా) భూమి మీద గల వృక్షజాతులలో 85% జాతులకు చెందిన మొక్కల వేర్లమీద ప్రవర్ధమానమవుతుంది. అది మొక్క వేర్లలోకి చొచ్చుకుపోయి వేరు బుడిపెలుగాను, నేలలో స్పోర్స్ రూపంలోనూ ప్రత్యక్షమవుతాయి.

మొక్కలకూ భాస్వరాన్ని సూక్ష్మపోషకాలనూ అందించటానికై మైకోరైజా ఉపకరిస్తుంది. ఆయా మొక్కల వేర్లు పోషకాలను స్వీకరించే సామర్థ్యాన్ని అరవైశాతం మేరకు పెంచుతుంది.

కె.సి.పి సుగర్స్ మైకోరైజాను రెండు రూపాలలో ఉత్పత్తి చేస్తోంది. అందులో ఒకటి ఈకోరైజా- ఇది పౌడర్ రూపంలో వుంటుంది. పొలాల్లో ఉపయోగించడానికి అనువైనది. రెండవది నర్సరైజా- నర్సరీలలో పాలిథీన్ సంచులలో మొక్కలు పెంచటానికిది ఉపయోగపడుతుంది.

ఈకోరైజా - దీనివల్ల మొక్కలు భాస్వరాన్ని స్వీకరించే సామర్థ్యం పెరుగుతుంది. జింకు, రాగి, ఇనుము, గంధకం, మాంగనీస్, కోబాల్టు, మోలిబ్డినమ్ మొదలగు సూక్ష్మ పోషకాలను స్వీకరించగల శక్తి పెరుగుతుంది. మొక్కలు నీటిని తీసుకునే సామర్థ్యం పెరుగుతుంది. చీడ పీడలను తట్టుకోవడానికి అవసరమైన నిరోధక శక్తి పెంపొందుతుంది.

లవణాల స్థాయి హెచ్చుగా ఉండటం, లోహాలవల్ల హానికర ప్రభావం అధికంగా వుండటం వంటి అవలక్షణాలు నేలలో వున్నప్పటికీ ఆ నేలలోని పైర్లు వాటిని వర్షాభావ పరిస్థితిని తట్టుకోవటానికి దోహదపడుతుంది. నాటిన మొక్కలలో బతికే వాటి శాతం అధికమవుతుంది. మొక్కల వేర్లకు అందుబాటులో ఉండే ప్రదేశంలో ఉపకారులగు సూక్ష్మాతి సూక్ష్మ జీవుల సంఖ్య వృద్ధి చెందుతుంది. ఈకోరైజా వాడినందువల్ల పైరుకు వేసే భాస్వరపు ఎరువులో నలభై శాతం తగ్గించుకోవచ్చు.

దీనిని మామిడి, కొబ్బరి, సీతాఫలం, జామ, ఉసిరి, జీడిమామిడి, దానిమ్మ, నారింజ, నిమ్మ, చింత వెదురు తదితర చెట్లకు, ద్రాక్ష, బొప్పాయి, గుమ్మడి, సొర, టమాటో, తమలపాకు, అనాస, అరటి, బెండ, మిరప, గులాబి, మల్లె, మల్బరి, పొగాకు, ఆముదం తదితర పంటలన్నింటికి ఉపయోగించుకోవచ్చు.

వేర్వేరు అవసరాలకు తగిన రూపాలలో ప్రత్యేకమైన పాకింగులలో వాటిని ఉపయోగించటానికి తగిన సూచనలతో కెసిపి షుగర్ అండ్ ఇండస్ట్రీస్ కార్పొరేషన్‌వారు మైకోరైజాను అందిస్తున్నారు.

7-7-05

# అణువంత కంప్యూటర్

## ఇక 'సూపర్' బలాదూర్!

క్వాంటం కంప్యూటింగ్ ద్వారా పరమాణుస్థాయిలో కంప్యూటర్ల తయారీ సాధ్యమేనన్న అంచనా చాలా కాలంగా ఉంది. వాస్తవరూపం దాల్చేందుకు ఇప్పటివరకూ కొన్ని అడ్డంకులు ఉండేవి. శాస్త్ర, సాంకేతిక పరిజ్ఞానంలో వచ్చిన మార్పుల కారణంగా ఈ ఇబ్బందులు చాలావరకూ తొలగిపోయాయి. హెచ్‌పీ, డీ-వేవ్ సిస్టమ్స్ వంటి కంపెనీలు క్వాంటం కంప్యూటర్ల తయారీకి సిద్ధమవుతున్నాయి. డిజైన్‌లో కీలక మార్పులు చేయడం ద్వారా త్వరలోనే క్వాంటం కంప్యూటర్లను తయారుచేయగలమని హెచ్‌పీ అంటూంటే, మరో మూడేళ్లలో తాము క్వాంటం కంప్యూటర్లను మార్కెట్‌లోకి విడుదల చేస్తామని డీవేవ్ సిస్టమ్స్ ధీమా వ్యక్తం చేస్తోంది.

### క్వాంటం మెకానిక్స్ మహత్యమిది

మనచుట్టూ ఉన్న భౌతిక ప్రపంచాన్ని అర్థం చేసుకునేందుకు, వివరించేందుకు సంప్రదాయ భౌతికశాస్త్రం ఉపయోగపడుతుంది. అయితే పదార్థ పరిమాణం పరమాణు స్థాయికి చేరినపుడు అందులోని ఎలక్ట్రాన్లు, ప్రోటాన్లు, న్యూట్రాన్ల ధర్మాలు మారిపోతాయి. వీటిని వివరించేందుకు సంప్రదాయ భౌతిక శాస్త్రం కంటే క్వాంటం మెకానిక్స్ ఎక్కువ ఉపయోగపడుతుంది. ఈ శాస్త్రంలో ఉన్న కొన్ని అంశాలను మనకు అనుకూలంగా మార్చుకోవడం ద్వారా క్వాంటం కంప్యూటర్లను తయారు చేయాలన్నది శాస్త్రవేత్తల ఆలోచన. 1982లో నోబెల్ అవార్డు గ్రహీత రిచర్డ్ ఫేన్‌మన్ తొలిసారి దీనిని ప్రతిపాదించారు. ఆ తరువాత చాలాకాలం పాటు ఇది కేవలం సైద్ధాంతిక చర్చకు మాత్రమే పరిమితమైంది. బెల్ ల్యాబొరేటరీకి చెందిన షోర్ అనే శాస్త్రవేత్త రహస్య సంకేతాలను విడగొట్టేందుకు ఓ అల్గారిథమ్‌ను తయారు చేయడంతో తిరిగి ప్రపంచం దృష్టిని ఆకర్షిస్తోంది. ఈ అల్గారిథమ్ సాయంతో ఓ క్వాంటం కంప్యూటర్ ఎటువంటి సంక్లిష్టమైన రహస్య సంకేతాలనైనా ఇట్టే విడగొట్టగలదు.

### లాభాలు

క్వాంటం కంప్యూటర్లకు ఉన్న సామర్థ్యం అంతా ఇంతా కాదు. అత్యధిక వేగం గల సూపర్ కంప్యూటర్లు నెలల తరబడి పని చేసి సాధించే పనిని... క్వాంటం కంప్యూటర్లు సెకన్ల కాలంలోనే పూర్తిచేస్తాయి. దీనివల్ల వాతావరణ మోడలింగ్ మొదలుకొని ప్రోటీన్ ముడుతలను అర్థం చేసుకోవడం వరకూ ఉన్న అనేక సంక్లిష్టమైన సమస్యలను సులువుగా పరిష్కరించవచ్చు.

### ఎలా పనిచేస్తుంది?

సాధారణ కంప్యూటర్లలో సమాచారం మొత్తం 0, 1 రూపంలో ఉంటుందని మనకు తెలుసు. క్వాంటం కంప్యూటర్లు మాత్రం దీనికి భిన్నం. వీటిల్లో సమాచారం క్వాంటం బిట్ లేదా క్యూబిట్ల రూపంలో ఉంటుంది. ఒక సమయంలో ఒక్కో ఎలక్ట్రాన్ ఉన్న వేర్వేరు స్థితులను (0, 1 లేదా రెండూ) క్యూబిట్లు అంటారు. మామూలు కంప్యూటర్లలో విద్యుత్తు ట్రాన్సిస్టర్ల ద్వారా విద్యుత్తు ప్రవహిస్తే 1 అని ప్రవహించకుండా ఉంటే 0 అని లెక్క. ఈ సున్నా, ఒకట్లు బులియన్ లాజిక్ గేట్ల ద్వారా ప్రవహించడం ద్వారా ఒక సమస్యను పరిష్కరించి తుదిఫలితాన్ని రాబడతాం. క్వాంటం కంప్యూటర్లలో బులియన్ లాజిక్‌గేట్లకు బదులుగా క్వాంటం గేట్లు ఉంటాయి. ఇవి క్యూబిట్లలో ఉన్న సమాచారాన్ని ప్రాసెస్ చేస్తాయి. అంటే డిజైన్ పరంగా ఒక సాధారణ కంప్యూటర్, క్వాంటం కంప్యూటర్ ఒకటే అన్నమాట. పనితీరులోనే తేడాలుంటాయి.

### ఎన్ని రకాలు?

క్వాంటం కంప్యూటర్లను తయారు చేసేందుకు ఎన్నో పద్ధతులున్నాయి. ప్రస్తుతం శాస్త్రవేత్తలు నాలుగింటిపై దృష్టి కేంద్రీకరించారు. అవి.. 1. లేజర్ల సాయంతో పరమాణువులను బంధించి పని చేయించుకోవడం, 2. ఫొటోనిక్ క్రిస్టల్స్ ద్వారా ఆప్టికల్ సర్క్యూట్లను ఉపయోగించడం, 3. అర్ధవాహకాల ఆధారంగా డిజైన్ చేసిన క్వాంటం డాట్స్‌ను వాడటం, 4. అతివాహక ఎలక్ట్రానిక్స్.

### అడ్డంకులు

క్వాంటం కంప్యూటర్ల తయారీకి దశాబ్దాలుగా ఆలోచనలు, ప్రయత్నాలు సాగుతున్నాయి. కానీ ఇప్పటివరకూ సాధించింది కొంతే. రెండు, మూడు క్యూబిట్లతో పనిచేసే క్వాంటం కంప్యూటర్లను శాస్త్రవేత్తలు తయారుచేయగలిగారు. వీటిసాయంతో చిన్నచిన్న లెక్కలను చేయడమూ వీలైంది. కానీ అన్నింటినీ తలదన్నే క్వాంటం కంప్యూటర్ తయారీకి ఇప్పటికీ కొన్ని అడ్డంకులున్నాయి. (1) క్యూబిట్లు ఒకేకాలంలో అనేక స్థితుల్లో ఉండటం వల్ల ఒక సమస్య తాలూకూ సరైన ఫలితమేమిటన్నది నిర్ధయించడం, (2) క్వాంటం కంప్యూటర్లకు తగిన హార్డ్‌వేర్‌ను సిద్ధం చేయడం, (3) క్యూబిట్లు పరిసరాలతో కలిసిపోవడం వల్ల జరిగే మార్పులను నియంత్రించడం వీటిల్లో ప్రధానమైనవి. ఈ సమస్యలను అధిగమించేందుకు లాస్ అలమోస్ నేషనల్ ల్యాబొరేటరీ కాలిఫోర్నియా, విశ్వవిద్యాలయం, మైక్రోసాఫ్ట్‌లతోపాటు మరికొన్ని బృందాలు ప్రయత్నాలు చేస్తున్నాయి. అమెరికాలోని డీ-వేవ్ సిస్టమ్స్ సంస్థ అతివాహక పదార్థాలతో క్వాంటం కంప్యూటర్లకు కావాల్సిన ఇంటిగ్రేటెడ్ సర్క్యూట్లను తయారుచేసే ప్రయత్నాల్లో ఉంది. ఇవన్నీ ఒక కొలిక్కి వస్తేగానీ అతిశక్తిమంతమైన, సూక్ష్మమైన క్వాంటం కంప్యూటర్లు మనకు అందుబాటులోకి రావు!

ఈనాడు

పక్క వీధిలో ఉన్న స్నేహితునికి ఫోన్ చేస్తే కాల్‌కు రెండు రూపాయలు ఖర్చవుతుంది.
అదే... అమెరికాలో ఉన్న బంధువుతో మాట్లాడితే నిమిషానికి రూపాయే..
టెక్నాలజీ తెచ్చిన సమాచార విప్లవమిది.. 129 ఏళ్ల టెలిఫోన్ చరిత్రలో ఇప్పుడు.. ఒక సరికొత్త శకం ప్రారంభం అవుతోంది. టెలిఫోన్‌ను గతకాలపు అవశేషంగా మార్చి వేయగల ఆ విప్లవం పేరే..

**నెట్ టెలిఫోన్..**

# నెట్‌లో హలో... ఇక అన్నీ ఫట్!

వోకల్‌టెక్.. చిన్న సాఫ్ట్‌వేర్ కంపెనీ. 1995 ఫిబ్రవరిలో ఈ కంపెనీ ఓ కొత్త సాఫ్ట్‌వేర్‌ను మార్కెట్లోకి విడుదల చేసింది. ఇంటర్నెట్ ద్వారా సంభాషించటానికి వీలు కల్పించే ఆ 'ఇంటర్నెట్ ఫోన్ సాఫ్ట్‌వేర్'కు ఎవ్వరూ పెద్ద ప్రాముఖ్యం ఇవ్వలేదు. ఎందుకంటే అప్పట్లో ప్రపంచమంతటా సెల్‌ఫోన్ ప్రభంజనం కొనసాగుతోంది. ఈ గొడవలో.. ఎవరూ.. ఈ 'చిన్న' విషయాన్ని పట్టించుకోలేదు. అయితే, ఆ చిన్న విషయమే.. ప్రస్తుతం కొమ్ములు తిరిగిన టెలిఫోన్ కంపెనీలకు ముచ్చెమటలు పోయిస్తోంది. వాయిస్ ఓవర్ ఇంటర్నెట్ ప్రొటోకాల్ (వీఓఐపీ) అని సాంకేతిక పరిభాషలో పిలిచే ఈ కొత్త టెక్నాలజీ వల్ల ప్రపంచంలోకి ఏ మూలకైనా మాట్లాడటం చాలా చవక అయిపోయింది. ఇంటర్నేషనల్ కాల్స్ కోసం రోజు రోజుకు ఎక్కువ మంది దీనిపైనే ఆధారపడుతున్నారు. 1876లో గ్రాహంబెల్ టెలిఫోన్‌ను కనుక్కున్నప్పటి నుంచి ఇప్పటివరకూ.. మామూలు ఫోన్‌కు ఎప్పుడూ ఇంత పోటీ రాలేదంటే అతిశయోక్తి కాదు.

## దీని రూటే వేరు..

మామూలుగా మన ఇళ్లలో ఉండే ఫోన్.. పబ్లిక్ స్విచ్డ్ టెలిఫోన్ నెట్‌వర్క్ ఆధారంగా పని చేస్తుంది. అంటే, ఎవరికైనా మనం ఫోన్ చేసినప్పుడు.. ఆ వ్యక్తి వద్ద ఉన్న ఫోన్‌కు.. మన ఫోన్‌కుమధ్య ఒక సర్క్యూట్ ఏర్పడుతుంది. సంభాషణ కొనసాగినంత సేపూ.. ఆ సర్క్యూట్ అలాగే ఉంటుంది. అంటే మనం మాట్లాడినంత సేపు ఆ 'లింక్'ను మనం అద్దెకు తీసుకుంటాం. ఈ సేవను అందించినందుకు, టెలిఫోన్ కంపెనీకి మనం కొంత రుసుము చెల్లిస్తుంటాం. ఇంటర్నెట్ ద్వారా మాట్లాడినప్పుడు ఈ లింక్ అవసరం ఉండదు. ఇంటర్నెట్‌లో ఇతర సమాచారం మాదిరిగానే మాటలు కూడా డిజిటల్ రూపంలోకి మారిపోతాయి. అనంతరం, చిన్న చిన్న సమాచార ప్యాకెట్లుగా విడిపోతాయి. గమ్యాన్ని చేరుకొని అక్కడ ఆ ప్యాకెట్లు కలిసి శబ్దతరంగాలుగా మారతాయి. ఈ ప్రక్రియకు ప్రత్యేకమైన సాఫ్ట్‌వేర్ అవసరమవుతుంది.

## తొలి అడ్డంకులు..

ఏ మార్పూ సులభంగా, వేగంగా వచ్చేయదు. ఇంటర్నెట్ టెలిఫోన్ విషయంలోనూ అదే కనిపిస్తుంది. ఈ టెక్నాలజీ వెలుగు చూసిన వెంటనే చిన్నాచితకా కంపెనీలు ఇంటర్నెట్ కాల్స్‌ను అవసరమైన సాఫ్ట్‌వేర్‌ను రూపొందించాయి. వీటిని ఉపయోగించి.. ఇంటర్నెట్ ద్వారా ఎక్కడికైనా ఉచితంగా లేదా అతి తక్కువ వ్యయంతో ఫోన్ చేసుకునే వీలు ఏర్పడింది. అయినా గానీ, అది అప్పట్లో అంతగా ప్రజాదరణ పొందలేదు. కారణం.. ఆ టెక్నాలజీ కొత్తది, దానిద్వారా జరిపే సంభాషణ అంత స్పష్టంగా ఉండేది కాదు. అన్నింటికీ మించి ఇళ్లల్లో ఇంటర్నెట్ కనెక్షన్ల సంఖ్య చాలా తక్కువగా ఉండేది. అయితే, ఐటీ రంగంలో వస్తున్న కొత్త సాఫ్ట్‌వేర్లు.. బ్రాడ్‌బ్యాండ్ కనెక్షన్లు ఈ పరిమితులను కొద్ది కాలంలోనే అధిగమించాయి. దీనితో పాటుగా కేవలం కంప్యూటర్ నుంచి కంప్యూటర్‌కు మాత్రమే కాకుండా.. కంప్యూటర్ నుంచి ఫోన్‌కు కూడా సంభాషణ జరిపే సౌలభ్యం ఏర్పడింది. ఇంటర్నెట్ టెలిఫోనీలో దీనినొక మైలురాయిగా చెప్పుకోవచ్చు.

## ముంచుకొస్తున్న వెల్లువ

వీఓఐపీ వస్తే తమ ఆదాయానికి గండిపడే అవకాశం ఉండటంతో.. ఆ టెక్నాలజీని బహుళజాతి టెలిఫోన్ కంపెనీలు మొదట్లో పట్టించుకోలేదు. అయితే అది తమ ప్రమేయం లేకుండా విస్తరిస్తుండటంతో అవి తమ పద్ధతిని మార్చుకుంటున్నాయి. వెరిజాన్, ఎటిఅండ్‌టీ, డచ్ టెలికాం, ఎన్‌టీటీ వంటి టెలికం దిగ్గజాలన్నీ ఇంటర్నెట్ కాల్స్‌ను అందించటానికి వీలుగా నెట్‌వర్క్‌లను మార్చుకుంటున్నాయి. దక్షిణకొరియా, జపాన్ దేశాల్లో.. బ్రాడ్‌బ్యాండ్ కనెక్షన్లు ఎక్కువగా ఉండటం వల్ల వీఓఐపీ బాగా విస్తరిస్తోంది. అయితే, వీఓఐపీ వెల్లువ వల్ల.. మొబైల్ కంపెనీలు బాగా నష్టపోయే పరిస్థితి కనిపిస్తోంది. ముఖ్యంగా, థర్డ్ జనరేషన్ ఫోన్లపై కొన్ని కంపెనీలు భారీ పెట్టుబడులు పెట్టాయి. ఇప్పుడు, పరిస్థితి అంతా తారుమారయ్యేలా ఉందని నిపుణులు అంటున్నారు.

## భవిత ఇది..

ఇంటర్నెట్ టెలిఫోనీ వల్ల టెలికం రంగ రూపురేఖలే మారనున్నాయి. ఒక వెబ్‌సైట్, టెలిఫోన్ సేవలను అందించగల టెక్నాలజీ - ఈ రెండూ ఉన్న ఏ కంపెనీ అయినా.. ఇప్పుడిక వీఓఐపీ రంగంలోకి దిగవచ్చు. అనేక కంపెనీలు దీనిని ఒక అవకాశంగా భావిస్తున్నాయి. గూగిల్ కూడా ఈ రేసులో దిగిందంటే, దీనిపై సాఫ్ట్‌వేర్ కంపెనీలు ఎంత శ్రద్ధ చూపుతున్నాయో అర్థం చేసుకోవచ్చు. ఇదే ఒరవడి కొనసాగితే కొంత కాలానికి సాఫ్ట్‌వేర్ కంపెనీలు టెలికం రంగంలోకి ప్రవేశించి.. తమ ప్రత్యేకతను చాటుకోవటానికి ప్రయత్నించినా ఆశ్చర్యపోవాల్సిన అవసరం లేదు.

### రెండురకాలు

ఇంటర్నెట్ టెలిఫోనీ రెండు విధాలుగా ఉంటుంది. ఒకటి.. కంప్యూటర్ నుంచి కంప్యూటర్‌కు, రెండోది.. కంప్యూటర్‌నుంచి ఫోన్‌కు. మొదటి పద్ధతిలో సంభాషించాలంటే.. రెండు కంప్యూటర్లలోనూ ఒకే విధమైన టెలిఫోన్ సాఫ్ట్‌వేర్ ఉండాలి. అంటే ఒక కంప్యూటర్‌లో నెట్‌టూఫోన్ సాఫ్ట్‌వేర్ ఉంటే వేరే దాంట్లో కూడా అదే సాఫ్ట్‌వేర్ ఉండాలి. కంప్యూటర్ నుంచి కంప్యూటర్ మధ్య సంభాషణ జరిగినప్పుడు.. ఖర్చు ఉండదు. ఇక కంప్యూటర్ నుంచి ఫోన్‌కు కాల్ చేసినప్పుడు మాత్రం కంప్యూటర్‌లో సాఫ్ట్‌వేర్ ఉంటే సరిపోతుంది. దాదాపు మూడు నాలుగేళ్ల క్రితం దాకా ఇంటర్నెట్ ద్వారా కాల్స్ చేసుకోవటం ఉచితంగా ఉండేది. ప్రస్తుతం నిమిషానికి రూపాయి దాకా వసూలు చేస్తున్నారు.

### ఏం కావాలి?

పీసీ – విండోస్ ఆపరేటింగ్ (ఏ వెర్షన్ అయినా ఫర్వాలేదు) సిస్టమ్ ఉండాలి.

- కనీసం 128 రామ్ ఉంటే మంచిది. దీని వల్ల మాటలు స్పష్టంగా వినిపిస్తాయి.
- ఇంటర్నెట్ టెలిఫోనీలో మాట్లాడుకోవటానికి సాఫ్ట్‌వేర్‌ను డౌన్‌లోడ్ చేసుకోవాలి. net2phone, call2cents వంటి వెబ్‌సైట్ల నుంచి వీటిని డౌన్‌లోడ్ చేసుకోవచ్చు. అయితే ఏ వెబ్‌సైట్ నుంచి సాఫ్ట్‌వేర్‌ను డౌన్‌లోడ్ చేసుకున్నామో, అదే వెబ్‌సైట్‌లో కొంత సమయాన్ని కూడా కొనుగోలు చేయాల్సి ఉంటుంది.
- పీసీకి స్పీకర్లు.. మైక్రోఫోన్ అమర్చుకోవాలి. లేదా ఈ రెండు ఉన్న హెడ్‌సెట్‌ను కొనుగోలు చేసుకోవాలి.
- ఇంటర్నెట్ కనెక్షన్ తప్పనిసరిగా ఉండాలి. 56 కిలోబైట్స్ పర్ సెకండ్ వేగంతో సమాచారం అందితే నెట్‌ఫోన్ నుంచి మాటలు స్పష్టంగా వినిపిస్తాయి.

# బ్రాడ్ బ్యాండ్ వచ్చె లాభాలెన్నో తెచ్చె!

### ఇప్పటి దాకా..

సమాచారాన్ని ఒక చోట నుంచి మరొక చోటకు అత్యంత వేగంతో పంపే కనెక్షన్‌ను బ్రాడ్‌బ్యాండ్ అంటారు. కాలాన్ని సెకన్లు, నిమిషాలు, గంటల్లో కొలిచినట్లు.. ఇంటర్నెట్‌లో సమాచారాన్ని బైట్లు, కిలోబైట్లు, మెగాబైట్లు, గిగాబైట్లు, టెరాబైట్లుగా కొలుస్తారు. ఈ సమాచారం అందుకోవటానికి ప్రస్తుతం రెండు పద్ధతులు అందుబాటులో ఉన్నాయి. మొదటివి డయిలప్ కనెక్షన్లు. వీటి ద్వారా వచ్చే సమాచారం ప్రతి సెకండుకు 56 కిలోబైట్స్ దాకా ఉంటుంది. ఈ తరహా కనెక్షన్లకు టెలిఫోన్ లైన్, మోడెమ్ తప్పనిసరి. ఇక రెండోవి కేబుల్ లైన్లు. వీటికి టెలిఫోన్ లైను అవసరం లేదు. వీటిని నేరుగా పీసీకి అమరుస్తారు. ఈ కేబుల్ ద్వారా అందే సమాచారం వేగాన్ని బట్టి వాటిని ఐఎస్‌డీఎన్.. డీఐఏఎస్.. బ్రాడ్‌బ్యాండ్‌గా వర్గీకరిస్తారు. వీటి కోసం వాడే టెక్నాలజీ కూడా వేర్వేరుగా ఉంటుంది. సాధారణంగా బ్రాడ్‌బ్యాండ్ సర్వీసు.. డయిలప్ సర్వీసు కన్నా దాదాపు పదిహేడు రెట్లు వేగంగా ఉంటుంది.

ISDN, DIAS

### బీఎస్ఎన్ఎల్ కనెక్షన్ విశేషమేమిటి?

బీఎస్ఎన్ఎల్ కేబుల్ నుంచి కాకుండా టెలిఫోన్ లైన్ ద్వారా బ్రాడ్‌బ్యాండ్ సేవలను అందిస్తోంది. అంటే మనకు టెలిఫోన్ ఉంటే బ్రాడ్‌బ్యాండ్ సేవలు కూడా పొందవచ్చు. ఎసింక్రోనస్ డిజిటల్ సబ్‌స్క్రైబర్ లైన్(ఏడీఎస్ఎల్) అని పిలిచే ఈ అత్యాధునిక టెక్నాలజీని ఇప్పటి దాకా అమెరికాలో మాత్రమే ఉపయోగిస్తున్నారు. ఈ టెక్నాలజీలో మామూలు ఫోన్‌కు ఏడీఎస్ఎల్ మోడెమ్‌ను అమర్చాలి. అయితే ఈ మోడెమ్‌ను అమర్చటం వల్ల మామూలు ఫోన్‌లో వచ్చే కాల్స్‌కు ఎటువంటి సమస్య ఉండదు. ఏడీఎస్ఎల్ టెక్నాలజీ వల్ల ఉన్న మరో ఉపయోగమేమిటంటే పీసీ నుంచి నెట్‌వర్క్‌కు వెళ్లే సమాచారం కన్నా నెట్‌వర్క్ నుంచి పీసీకి అందే సమాచారం పది రెట్లు ఉంటుంది. అంటే ఒక్క సారి మౌస్‌ను క్లిక్ చేస్తే ఇంటర్నెట్ నుంచి ఎక్కువ సమాచారం అందుతుంది. దీని వల్ల ఇంటర్నెట్ ద్వారా పాటలు.. సినిమాలు తక్కువ సమయంలో డౌన్‌లోడ్ చేసుకోవటానికి వీలవుతుంది.

### ఇబ్బందులుండవా?

డయిల్ అప్ కనెక్షన్‌లో ఇంటర్నెట్‌ను ఉపయోగించుకుంటుంటే ఫోన్ ఎంగేజ్ వస్తుంది. కేబుల్ అయితే వేరే కనెక్షన్ పెట్టుకోవాల్సి ఉంటుంది. ఏడీఎస్ఎల్ టెక్నాలజీలో మాత్రం ఫోన్, ఇంటర్నెట్‌లను ఒకేసారి ఉపయోగించుకోవచ్చు. వాస్తవానికి ఈ ఏడీఎస్ఎల్ టెక్నాలజీని టెలిఫోన్ లైన్ల ద్వారా టెలివిజన్ ప్రసారాల కోసం రూపొందించారు. అంటే ఒకే టెలిఫోన్ లైను ద్వారా మామూలు ఫోన్ కాల్స్, ఇంటర్నెట్, టెలివిజన్ ప్రసారాలు పొందే అవకాశం ఉంటుంది. భవిష్యత్తులో ఈ సేవలను మరింతగా విస్తరించాలని భావిస్తే.. టెలిఫోన్ లైన్ల ద్వారా టెలివిజన్ ప్రసారాలు కూడా చేసే అవకాశం ఉంటుంది.

### ఎంతైనా వాడుకోవచ్చా?

ఈ కొత్త స్కీము ప్రకారం బీఎస్ఎన్ఎల్ టెలిఫోన్‌లైను ఉన్నవారు ఆరువందల రూపాయలు (ఐదు వందలు బ్రాడ్‌బ్యాండ్ కనెక్షన్‌కు, వంద రూపాయలు మోడెమ్ అద్దెగా) చెల్లిస్తే ఈ కొత్త కనెక్షన్ పొందవచ్చు. అయితే దీనిలో చిన్న మెలిక ఉంది. ఐదు వందల రూపాయల స్కీములో చేరిన వారు 1 గిగాబైట్స్ సమాచారాన్ని డౌన్‌లోడ్ లేదా అప్‌లోడ్ చేసుకోవచ్చు. మనం ఒక వెబ్‌సైట్‌ను చూసినప్పుడల్లా కొంత సమాచారం మన పీసీకి చేరుతుంది. ఇతరులతో ఛాట్ చేసినప్పుడు కొంత సమాచారాన్ని అప్‌లోడ్ చేయాల్సి ఉంటుంది. బీఎస్ఎన్ఎల్ అందిస్తున్న బ్రాడ్‌బ్యాండ్ కనెక్షన్ తీసుకుంటే ఈ మొత్తాన్ని లెక్క-బెడతారు. ఇది ప్రతి నెలా 1 గిగాబైట్ దాటకూడదు. ఇప్పుడు కొందరు కేబుల్ ఆపరేటర్స్ అందిస్తున్న స్కీముల్లో ఇంటర్నెట్ స్పీడ్ తక్కువగా ఉంటుంది. అయితే ఎంత సమాచారాన్నైనా డౌన్‌లోడ్ లేదా అప్‌లోడ్ చేసుకోవచ్చు.

### సమస్యలేమిటి?

బ్రాడ్‌బ్యాండ్ కనెక్షన్ తీసుకుంటే భద్రతపై మరింత శ్రద్ధ చూపాల్సి ఉంటుంది. కాజా వంటి ఫైల్ షేరింగ్ సాఫ్ట్‌వేర్‌లు ఉపయోగించినా, వైరస్‌లు వచ్చి చేరినప్పుడు సరిగ్గా చూసుకోపోయినా సమాచారం ఎక్కువ అప్‌లోడ్ అయిపోతుంది. దీనితో ఖర్చు కూడా ఎక్కువ అవుతుంది.

### ఎవరికి మంచిది?

ఎంత సేపు పీసీని ఉపయోగిస్తారు.. ఎలాంటి పనులకు ఉపయోగిస్తారు అనే విషయాలపై ఆధారపడి ఉంటుంది. ఉదాహరణకు వెబ్‌సైట్లను అప్‌లోడ్ చేసే వారికి బ్రాడ్‌బ్యాండ్ చాలా ఉపకరిస్తుంది. కేవలం వెబ్‌సైట్లు బ్రౌజ్ చేయటం.. మెయిల్స్ చూడటం.. ఛాటింగ్ చేయటానికి మామూలు కేబుల్ కనెక్షన్ సరిపోతుంది. వెబ్‌కెమెరాలు ఉపయోగించే వారికి బ్రాడ్‌బ్యాండ్ ఎంతో ఉపకరిస్తుంది.

### బ్రాడ్‌బ్యాండ్ విశేషాలు..

- కన్ను మూసి తెరిచేలోపులో సమాచారం ప్రత్యక్షమవుతుంది.
- భవిష్యత్తులో టీవీ, ఇంటర్నెట్ మామూలు టెలిఫోన్ లైన్ నుంచే పొందే అవకాశం ఉంటుంది.
- బ్రాడ్‌బ్యాండ్ ప్రాజెక్టుపై బీఎస్ఎన్ఎల్, ఎంఎన్‌టీఎల్ ఏడువందల కోట్ల రూపాయలు ఖర్చు పెట్టాయి. మన రాష్ట్రంలో బీఎస్ఎన్ఎల్ దాదాపు ఇరవై కోట్ల రూపాయలు ఖర్చు చేసింది.
- అతి త్వరలోనే మరో పది పట్టణాల్లోను, మరో రెండు నెలల్లో రెండు వందల పట్టణాల్లోను బ్రాడ్‌బ్యాండ్ సేవలు అందించటానికి బీఎస్ఎన్ఎల్, ఎంఎన్‌టీఎల్ సంసిద్ధం అవుతున్నాయి.
- ఆంధ్రప్రదేశ్‌లో కాకినాడ, చిత్తూరు, ఏలూరు, శ్రీకాకుళం, ఆదిలాబాద్, విజయనగరం, గోదావరిఖని ప్రాంతాల్లో కూడా బ్రాడ్‌బ్యాండ్ సేవలను అందించే ఆలోచనలో బీఎస్ఎన్ఎల్ ఉంది.
- ప్రస్తుతం కేబుల్ ద్వారా ఇంటర్నెట్ సేవలు అందించేవారు నెలకు ఐదు వందల నుంచి వెయ్యి రూపాయల వరకూ వసూలు చేస్తున్నారు. బ్రాడ్‌బ్యాండ్ దెబ్బకు వీరు ధరలు తగ్గించే అవకాశం ఉంది.



గ్రాఫిక్ : సముద్రాల

## అరణ్యరోదనం

ఒకప్పుడు.. భూమి అంతటా దట్టమైన అరణ్యాలు ఉండేవి.. కానీ ఈనాడు.. అవి కేవలం 21 శాతం ప్రాంతానికే పరిమితమైనాయి. కారణం.. అటవీప్రాంతాల వినాశనం. దీనివల్ల.. ఐదువంతుల అరణ్యాల్లో నాలుగు వంతులు నాశనం అయిపోగా.. కేవలం ఒక్క భాగం మాత్రమే మిగిలి ఉంది. ప్రస్తుతం ప్రతి ఏడాదీ దాదాపు కోటీ ఇరవై లక్షల హెక్టార్ల మేరకు అడవుల విధ్వంసం కొనసాగుతోంది. ఇదిలాగే వెళితే.. 2050కల్లా ప్రపంచంలోని అనేక అటవీప్రాంతాలు, అరణ్యాలు అదృశ్యమయిపోతాయి.

**ఏవిధంగా జరుగుతోంది?**

ఇంత పెద్ద ఎత్తున విధ్వంసం జరగటానికి కారణాలేమిటి? ..

- వ్యవసాయమే ప్రధాన కారణం. పెరుగుతున్న ఆహార అవసరాల రీత్యా అటవీప్రాంతాలను నిర్మూలించటం జరుగుతోంది. డబ్ల్యూడబ్ల్యూఎఫ్ అన్న స్వచ్ఛందసంస్థ ఇటీవల విడుదల చేసిన నివేదికలో ఈ విషయాన్నే ప్రధానంగా పేర్కొంది. స్విట్జర్లాండ్‌తో సమానమైన అటవీప్రాంతం ఏటా అదృశ్యమవుతోందని ఆ నివేదికలో తెలియజేశారు.
- వాణిజ్య పంటల అభివృద్ధి కూడా మరో కారణం.
- ఇళ్లు, భారీభవనాల నిర్మాణాలు, రకరకాల సామాగ్రి తయారీకి ఉపయోగించే కలపకోసం అడవులు అదృశ్యమవుతున్నాయి.
- మేకలు, గొర్రెలు వంటి పశువులు భారీ సంఖ్యలో మేత కోసం అడవుల పైన పడటం వల్ల కూడా అరణ్యాలకు ముప్పుగా పరిణమిస్తోంది.

**ఫలితాలెలా ఉంటాయి?**

- చెట్లు వాతావరణంలోని కార్బన్‌డయాక్సైడ్‌ను తీసుకొని ఆక్సిజన్‌ను విడుదల చేస్తాయి. అడవుల విధ్వంసం వల్ల.. ఈ ప్రక్రియ నిలిచిపోతుంది. అంటే, వాతావరణంలో CO2 మోతాదు విపరీతంగా పెరిగిపోతుంది. ఇదే, గ్లోబల్‌వార్మింగ్‌కు కారణమవుతోంది.
- చెట్లు వాటి వేర్ల ద్వారా భూమిలో ఉన్న నీటిని వాతావరణంలోకి తేమ రూపంలో విడుదల చేస్తుంటాయి. చెట్లను కొట్టేసినప్పుడు.. ఈ ప్రక్రియ ఆగిపోయి.. ఆ ప్రాంతంలోని వాతావరణం పొడిగా తయారవుతుంది. అంతేగాక, భూమిలో నీటిని నిలుపుకునే సామర్థ్యం తగ్గిపోతుంది.
- భూమికి ఒక కవచంలాగా ఉండే వృక్షాలను కొట్టేసినప్పుడు ఆ కవచం కూడా పోతుంది. దానివల్ల.. భూక్షయం మొదలవుతుంది.
- భూమిమీద ఉన్న జీవజాతులన్నింటిల్లో సగం అరణ్యాలపైన ఆధారపడే జీవిస్తున్నాయి. అరణ్యాలను ధ్వంసం చేసినప్పుడు.. అసంఖ్యాకమైన ఈ జాతులు కూడా అంతరించిపోతాయి. ఫలితంగా.. జీవసమతుల్యత దెబ్బతింటుంది.
- వివిధ ప్రాంతాలు ఎడారిప్రాంతాలుగా మారిపోవటానికి ఉన్న కారణాల్లో అరణ్యాల విధ్వంసం ప్రధానమైనది.

## ప్లాస్టిక్ ముప్పు

ఒకప్పుడు మట్టి, లోహం, కాగితం తదితర పదార్థాలతో తయారుచేసే రకరకాల పాత్రలు, పరికరాలు.. ఈ రోజు ప్లాస్టిక్‌తో తయారయిపోతున్నాయి. ప్లాస్టిక్ మన జీవితంలో ఒక భాగమైపోయింది. అన్నింటిలోకి.. ప్లాస్టిక్ క్యారీబాగులు మరింత విస్తారంగా వాడకంలోకి వచ్చాయి. దీనికి కారణం.. ప్లాస్టిక్ చవకగా లభిస్తుంది.. ఎక్కువకాలంపాటు మన్నుతుంది. అయితే, ఈ అనుకూల అంశాలే ప్రతికూల అంశాలుగా మారుతున్నాయి. చవకకాబట్టి.. వాడి పారేస్తుంటాం. మన్నిక కాబట్టి.. ఏళ్లపాటు అలాగే ఉండిపోయి పర్యావరణానికి హానికరంగా తయారవుతుంది. వాడిపడేసిన ప్లాస్టిక్‌బ్యాగు నాశనమై ప్రకృతిలో కలిసిపోవటానికి 20 ఏళ్ల నుంచి వెయ్యేళ్ల వరకూ పడుతుంది. ఈలోపు అది అనేక సమస్యలను సృష్టిస్తుంది.

- ప్లాస్టిక్ బ్యాగులు భూమిలో అనేక ఏళ్లపాటు కూరుకుపోయి.. భూసారాన్ని గణనీయంగా తగ్గించివేస్తాయి
- డ్రైనేజీపైపుల్లో అడ్డుపడిపోవటం వల్ల.. మురికినీళ్లు నిలిచిపోయి అనేక వ్యాధులు వ్యాపిస్తాయి.
- ప్లాస్టిక్ కాలిస్తే వచ్చే పొగలో అనేక విషవాయువులుంటాయి. ఇవి.. ప్రతిఏటా కొన్ని వేల మంది ప్రాణాలు తీస్తున్నాయి.
- ప్లాస్టిక్‌ను చెత్తకుప్పలోంచి తీసుకొచ్చి రీసైకిల్ చేసి తిరిగి వినియోగానికి సిద్ధం చేస్తుంటారు. అయితే, చెత్తకుప్పల్లో ఉన్న బ్యాక్టీరియా రీసైక్లింగ్‌లో అంత సులభంగా పోదు. ఈ విధంగా తయారైన బ్యాగుల్లో ఆహారపదార్థాలను తీసుకువెళ్లినప్పుడు.. అనేక వ్యాధులు సంక్రమిస్తాయి.
- ప్లాస్టిక్ పరిశ్రమల సమీపంలో నివసించే ప్రజలు రకరకాల క్యాన్సర్‌లకు గురయ్యే ప్రమాదం ఉంది. పుట్టే పిల్లలు శారీరక లోపాలతో పుడతారు.
- పశువులు ప్లాస్టిక్‌బ్యాగులను తిని ప్రాణాలు కోల్పోతుంటాయి.

ఇవి మనకు కనిపించే నష్టాలు.. కనిపించకుండా జరిగే నష్టం మరింత తీవ్రస్థాయిలో ఉంది.

- నదులు, సముద్రాల్లోకి చేరిన ప్లాస్టిక్ వ్యర్థాలు అక్కడి జీవసంపదను నాశనం చేస్తున్నాయి. ప్రతి ఏడాదీ దాదాపు పది లక్షల సముద్రపు పక్షులు, ఒక లక్ష సముద్ర క్షీరదాలు ప్రాణాలు కోల్పోతున్నాయి.

## నేల, గాలి, నీరు... విషం!

సౌకర్యం కొద్దీ మనం ప్లాస్టిక్ బ్యాగులను వాడతాం. పంటదిగుబడులను పెంచుకునేందుకు విచ్చలవిడిగా క్రిమిసంహారక మందులు ఉపయోగిస్తాం. పరిశ్రమలు తమవంతుగా విషపదార్థాలను ఏమాత్రం శుద్ధి చేయకుండా నదుల్లోకి, నీటిప్రవాహాల్లోకి కలిపేస్తూంటాయి. ఫలితం.... గాలి, నేల, నీరు కలుషితం! ఇవన్నీ వ్యర్థాలే. విషతుల్యమైన వ్యర్థాలు. విషవ్యర్థాలకూ సునామీ స్థాయిలో విధ్వంసం సృష్టించగల సమర్థత ఉంది. అయితే ఇది ఒక్కసారిగా కనిపించేది కాదు. నెమ్మదినెమ్మదిగా కొరుక్కుతింటూంటే... మానవజాతి రోగాలు, జన్యులోపాల బారిన పడి నాశనమవుతూ వస్తుంది.

నిజానికి విషవ్యర్థాలకు స్పష్టమైన నిర్వచనం కూడా లేదు. స్థూలంగా చెప్పేదేమిటంటే విష, రేడియోధార్మిక, తుక్కుపట్టే, మండే, పేలే లక్షణాలున్న పదార్థాలతోపాటు కేన్సర్‌కారక, క్రోమోజోమ్‌లలో మార్పులు తేగల, గర్భస్థ శిశువులకు హానికలిగించే, శరీరంలో పేరుకుపోయే పదార్థాలన్నింటినీ విష వ్యర్థాలు అంటున్నారు. పరిశ్రమల ద్వారా మాత్రమే కాకుండా మనం వాడి పడేసే కొన్ని పరికరాలు (బ్యాటరీల వంటివి) కూడా విషవ్యర్థాలు పెరిగిపోయేందుకు కారణమవుతున్నాయి. కేబుళ్లలో తీగల కోసం ఉపయోగించే పాలీ క్లోరినేటెడ్ బైఫినైల్స్, స్టీలు, ఇనుము పరిశ్రమల్లో ఉపయోగించే ఇంధనాల వల్ల వెలువడే డయాక్సిన్స్, కాడ్మియం, నికెల్ వంటి పారిశ్రామిక లోహాలు, అణు రియాక్టర్లలో మిగిలిపోయే రేడియోధార్మిక పదార్థాలు... అన్నీ విషవ్యర్థాలే. వీటిని వదిలించుకునేందుకు ప్రస్తుతం మేలైన మార్గం కూడా లేదు. మండించి నాశనం చేయడం, భూమిలో పాతిపెట్టడం, రసాయన, జీవశాస్త్ర పద్ధతులను ఉపయోగించి ప్రమాదస్థాయిని తగ్గించడం మాత్రమే ప్రస్తుతమున్న దారులు.

## 'ఈ-చెత్త' బాధ అంతింత కాదు

పాత టీవీకి కొత్త టీవీ...! పేపర్లలో రోజూ కనిపించే ఈ ప్రకటనలు అందరూ చూసే ఉంటారు. చాలామంది ఈ ఎక్స్ఛేంజి ఆఫర్లను ఉపయోగించుకుని కొత్త ఎలక్ట్రానిక్ పరికరాలను తెచ్చుకుని ఉంటారు కూడా. మరి మీరు దుకాణాల వారికి ఇచ్చే పాత పరికరాలు ఏమవుతున్నాయని ఎప్పుడైనా ఆలోచించారా? కంపెనీలు వీటిలో పనికొచ్చే భాగాలను వేరుచేసి తిరిగి ఉపయోగిస్తాయి. మిగిలిన వాటిని చెత్తకుప్పలో పడేస్తాయి. దీనివల్ల పుట్టుకొచ్చిన సమస్యే... ఈ-వేస్ట్. అభివృద్ధి చెందిన దేశాల్లో అయితే కంపెనీలే కాదు.. ఎలక్ట్రానిక్ పరికరాలను చెత్తకుప్పల్లోకి తోసే వ్యక్తుల సంఖ్య కూడా చాలా ఎక్కువ. దీనివల్ల పర్యావరణానికి చాలా నష్టం ఉంది. ఎలక్ట్రానిక పరికరాల్లో ఉపయోగించే ప్రమాదకరమైన పదార్థాలు (సీసం, కాడ్మియం, పాదరసం వంటివి) నేలలోకి ఇంకిపోతాయి. నేల, నీరు కలుషితమవుతుంది. తద్వారా.. ఈ ప్రమాదకర పదార్థాలు మన శరీరాల్లోకి, జంతువుల శరీరాల్లోకి చేరిపోతాయి.

- విష వాయువులు, పదార్థాలు, ఆమ్లాలు, ప్లాస్టిక్ వంటివి వెయ్యి చేరితేనే ఒక కంప్యూటర్ తయారవుతుంది.
- టీవీ మానిటర్లలో ఉండే కాథోడ్ రే ట్యూబుల్లో లెడ్ ఆక్సైడ్, బేరియం, కాడ్మియం వంటి విషపదార్థాలుంటాయి.
- ఇక సెల్‌ఫోన్లు... వీటిల్లో పాదరసం, కాడ్మియం, ప్లాస్టిక్ వంటి ప్రమాదకారక పదార్థాలుంటాయి. గత ఏడాది క్రిస్మస్ సందర్భంగా బ్రిటన్‌లో అమ్ముడుపోయిన కొత్త సెల్‌ఫోన్ల సంఖ్య దాదాపు 40 లక్షలు. ఇందులో దాదాపు 15 శాతం రీసైకిల్ అవుతున్నాయి. మిగిలినవన్నీ చెత్తకుప్పల్లోకి చేరుతున్నాయి. అంతమేర కాలుష్యం పెరుగుతోందన్నమాట.

## మనమేం చేయవచ్చు?

జీవనవిధానం వల్ల కానీ, పెరుగుతున్న పారిశ్రామికీకరణ వల్ల కానీ మానవజాతి ప్రకృతి సమతౌల్యాన్ని దెబ్బతీస్తోందన్న మాట వాస్తవం. ప్రభుత్వాలు, పరిశ్రమలు అంతర్జాతీయ ఒప్పందాలతో, శాస్త్ర, సాంకేతిక పరిజ్ఞానాల సాయంతో విధ్వంసాలను అరికట్టే ప్రయత్నాలు చేస్తున్నాయి. అలాగని ఒక వ్యక్తిగా మనం నిమ్మకు నీరెత్తినట్టు ఉండాల్సిన అవసరం లేదు. తలా ఓ చేయి వేస్తేగానీ... దెబ్బతిన్న ప్రకృతి సమతౌల్యం ఒక గాడిలో పడదు. ఇందుకు మనమేం చేయవచ్చునంటే... ఒక్కమాటలో చెప్పాలంటే... అన్నింటినీ మితంగా వాడటం శ్రేయస్కరం.

ఇళ్లల్లో విద్యుత్తును పొదుపుగా వాడుకోగలిగితే... అంతమేర విద్యుదుత్పత్తిని తగ్గించి... తద్వారా సహజ వనరులను కాపాడవచ్చు.

- కలపను జాగ్రత్తగా వాడితే.. అరణ్యాల విధ్వంసం వల్ల తలెత్తే పరిస్థితిని నివారించవచ్చు. అన్నింటికీ కలపనే వాడే బదులు ప్రత్యామ్నాయ పద్ధతులను కూడా ఉపయోగించుకోవాలి.
- ప్రజా రవాణా వ్యవస్థను వీలైనంతగా ఉపయోగిస్తే... అంతమేర పెట్రోలు, డీజిల్ల వాడకం తగ్గుతుంది. ఆదాకు ఆదా... భూమికి మేలు.
- ప్లాస్టిక్ వినియోగాన్ని వీలైనంత తగ్గించుకోవాలి. సహజసిద్ధంగా నాశనమయ్యే కాగితాన్ని ఉపయోగించడం మేలు.
- నీటిని విచ్చలవిడిగా వాడటం కూడా మంచిది కాదు. మున్సిపాలిటీ వ్యవస్థల ద్వారా మనకు చేరే నీరు... అపురూపమైనదిగా భావించి వ్యవహరించండి. ఎందుకంటే ఈ నీటిని ఎక్కడో ఉన్న చెరువులు, నీటి వనరుల నుంచి సేకరించి, శుద్ధి చేసి మనకందిస్తున్నారు. మనం ఎంత దుబారా చేస్తే... అంతమేర నీరు రైతులకు, పరిశ్రమలకు ఉప

## అంతర్జాతీయ చట్టాలు కోకొల్లలు

పర్యావరణ పరంగా భూమికి జరుగుతున్న నష్టాన్ని ప్రపంచదేశాలు ఎన్నడో గుర్తించాయి. ప్రమాదాన్ని తగ్గించేందుకు ఎన్నో ఒప్పందాలు కుదుర్చుకున్నాయి కూడా. వాటిల్లో మచ్చుకు కొన్ని...

- ఈ ఏడాది ఫిబ్రవరి 16 నుంచి క్యోటో ప్రొటోకాల్ అమల్లోకి రానుంది. ఐక్యరాజ్యసమితి ఆధ్వర్యంలోని ఇంటర్ గవర్నమెంటల్ ప్యానల్‌ఫర్ క్లైమెట్ ఛేంజ్ సంస్థ ఈ ఒప్పంద ముసాయిదాను సిద్ధం చేసింది. దీనిప్రకారం... ఒప్పందానికి అంగీకరించిన దేశాలన్నీ తాము వాతావరణంలోకి విడుదల చేస్తున్న గ్రీన్‌హౌస్ వాయువులను 1990 నాటిస్థాయికి తగ్గించుకోవాలి.
- జీవవైవిధ్యాన్ని కాపాడేందుకు 1975లో కుదిరిన ఒప్పందం... "కన్వెన్షన్ ఆన్ ఇంటర్నేషనల్ ట్రేడ్ ఇన్ ఎన్‌డేంజర్డ్ స్పీషీస్ ఆఫ్ వైల్డ్ ఫౌనా అండ్ ఫ్లోరా". దీని ప్రకారం... జంతువుల ఎగుమతి, దిగుమతులను నిషేధించారు.
- ఓజోన్ పొర క్షీణతను అరికట్టేందుకు 1987లో మాంట్రియాల్ ఒప్పందం కుదిరింది. దీని ప్రకారం... ఓజోన్ పొర క్షీణించేందుకు కారణమవుతున్న రసాయనాలను ప్రతిదేశం నిర్దిష్ట ప్రమాణాల మేరకు తగ్గించుకోవాల్సి ఉంటుంది.
- ప్రమాదకరమైన విషవ్యర్థాల రవాణా, వ్యాపారాలను అరికట్టేందుకు 1989లో బేసల్ కన్వెషన్ ఏర్పాటైంది. దీనిప్రకారం... విషవ్యర్థాల రవాణా కొన్ని ప్రాంతాలకే పరిమితం కావాలి.
- దేశాధినేతలు... శాస్త్రవేత్తలు పెద్దసంఖ్యలో పాల్గొన్న 'ధరిత్రి సదస్సు'లో రెండు ముఖ్యమైన అంతర్జాతీయ ఒప్పందాలు కుదిరాయి. గ్లోబల్‌వార్మింగ్‌కు కారణమవుతున్న వాయువుల మోతాదులను స్వచ్ఛందంగా తగ్గించుకోవడం వీటిల్లో ఒకటి. నశించిపోతున్న జీవజాతుల, జీవావరణ వ్యవస్థల రక్షణకు అనుసరించాల్సిన మార్గాలు రెండోది. అయితే అమెరికా ఒత్తిడి కారణంగా సదస్సు చివరి నిమిషంలో గ్లోబల్‌వార్మింగ్‌కు సంబంధించిన ఒప్పందాన్ని వెనక్కు తీసుకున్నారు.
- 2002లో దక్షిణాఫ్రికాలోని జొహెన్స్‌బర్గ్‌లో ప్రపంచసదస్సు జరిగింది. 200 దేశాల ప్రతినిధులు పాల్గొన్న ఈ సదస్సులో 21వ శతాబ్దంలో పర్యావరణ నష్టాలను తగ్గిస్తూనే... అభివృద్ధిని కొనసాగించేందుకు అనుసరించాల్సిన పద్ధతుల గురించి చర్చలు జరిగాయి. ఈ ప్రక్రియలో అభివృద్ధి చెందుతున్న దేశాలు కూడా పాలుపంచుకోవాలని నిర్ణయించారు.

## భారీ ఆనకట్టలు ఎంత భద్రం?

నీటికి నడక నేర్పిస్తూ.. ఆనకట్టలను నిర్మించటం వందల ఏళ్లుగా ఉన్నదే. అయితే, భారీ ఆనకట్టలు మాత్రం 1930ల నుంచి బాగా పెరిగాయి. అప్పట్లో వాటిని ఆర్థిక ప్రగతికి సంకేతంగా భావించేవారు. ఈ ధోరణి 1970లలో ఉచ్ఛస్థితికి చేరుకుంది. అయితే, వీటివల్ల కలిగే నష్టాలు కూడా బయటపడుతుండటంతో.. భారీ ఆనకట్టల నిర్మాణం వివాదాస్పద అంశంగా మారింది. ఈ నేపథ్యంలో.. ది వరల్డ్ కమీషన్ ఆన్ డ్యామ్స్ 1998లో ఓ అధ్యయనాన్ని చేపట్టింది. దానిలో చాలా ఆసక్తికరమైన విషయాలు తెలిశాయి.

- ప్రపంచవ్యాప్తంగా దాదాపు 45 వేల భారీ డ్యాములున్నాయి.
- నదుల్లో దాదాపు సగం కనీసం ఒక భారీ ఆనకట్టను కలిగి ఉన్నాయి.
- సాగవుతున్న మొత్తం భూమి 2.71 కోట్ల హెక్టార్లు. దీనిలో దాదాపు 30 నుంచి 40 శాతం భారీడ్యాములపైన ఆధారపడే జరుగుతోంది.

**లాభాలకన్నా.. నష్టాలే ఎక్కువ!**

భారీఆనకట్టలను సాగు, తాగు నీటికోసం, విద్యుత్తు అవసరాల కోసం, వరదల నియంత్రణ కోసం నిర్మిస్తారు. ఈ ప్రధాన లక్ష్యాలతోపాటు.. ఆయా ప్రాంతాల అభివృద్ధి, ఉద్యోగాల కల్పన, పరిశ్రమల ఏర్పాటు తదితర ఇతర లాభాలు కూడా ఉంటాయి. అయితే, ఈ లక్ష్యాలను భారీ ఆనకట్టలు ఏ మేరకు సాధించాయన్నదానిని కూడా ది వరల్డ్ కమీషన్ ఆన్ డ్యామ్స్ పరిశీలించింది. దాని ప్రకారం..

- సాగు, తాగు నీటి అవసరాల కోసం కట్టిన ఆనకట్టలు అనుకున్న లక్ష్యాలను పూర్తిగా సాధించలేకపోయాయి. వాటిపైన వ్యయం చేసిన పెట్టుబడులు పూర్తిగా వెనక్కి రాలేదు. వరద నియంత్రణ, విద్యుత్ అవసరాల కోసం నిర్మించినవి మాత్రం మంచి ఫలితాలనే సాధించాయి.
- జీవావరణం విషయానికొస్తే.. చాలా అరణ్యాలు నాశనమయ్యాయి, ఫలితంగా అనేక జీవజాతులు అంతరించాయి, నీటిలో జీవించే జంతుజాలం కూడా తీవ్ర ప్రమాదాన్ని ఎదుర్కొంటుంది.
- ప్రాజెక్టులు కట్టే ప్రాంతంలో ఉండే ప్రజల పరిస్థితి దయనీయంగా మారుతోంది. భారీప్రాజెక్టుల కారణంగా, ఇప్పటివరకూ ప్రపంచవ్యాప్తంగా నాలుగు నుంచి ఎనిమిది కోట్లమంది ప్రజలు నిర్వాసితులయ్యారు. వీరికి జీవనోపాధి కల్పించే పని సరిగ్గా జరగలేదు. ఎక్కడో ఒక చోట ఏదో విధంగా జీవిస్తున్నా.. వారి సంస్కృతి, సామాజిక, ఆర్థిక పరిస్థితులు తీవ్రంగా దెబ్బతిన్నాయి. పునరావాసం కొంత ఏర్పాటయినా అక్కడి వాతావరణ పరిస్థితులు భిన్నంగా ఉండటంతో ప్రజలు అనేక రోగాల బారిన పడుతున్నారు.

# SCIENCE & TECHNOLOGY

## CFCs and Ozone Depletion

■ *By Dr. Manoj Kumar*

Although it is present in concentration in a few parts per million or less, Ozone ($O_3$) is concentrated in the Earth's stratosphere, 15-50 km above the surface of the Earth. During the mid 1980s scientists suddenly realized that above Antarctica Ozone levels were falling dramatically. The substances most responsible for this sudden collapse were identified as chlorofluoro carbons or CFCs.

### Reactions Involved in Ozone Depletion

What seems to happen is that the chemical $CFCl_3$ may be broken down by a quantum of high energy as follows:



$CFCl_3$ + light - $CFCl_2$ + Cl

The chlorine radical (Cl) thus formed can then cause the conversion of ozone to dimolecular oxygen without itself being used up in the process:



$Cl + O_3$ - $ClO + O_2$

and



$ClO + O$ - $Cl + O_2$

In this way a single molecule of $CFCl_3$ can remove hundreds of thousands of ozone molecule. This loss of ozone molecules is what is termed as depletion of the ozone layer. When this happens the ozone layer's capacity to filter out the harmful ultraviolet rays from the sun decreases.

### Why ozone hole in polar region?

This happens especially near the poles in the spring. Here the prevailing low temperature of the stratosphere makes the ozone more vulnerable to reaction with chlorine. As a rusult, even small amount of chlorine which waft to these hights can cause immense damage to the ozone layer. In the normal course, the nitrous oxides destroy the chlorine monoxide and prevent depletion of the ozone layer. However, in the sub-zero temperature of the stratosphere above the polar regions, the nitrous oxides freeze to form ice clouds. And chloride monoxide accumulates. With increasing dilution of the ozone, it thins, and a hole appears.

### Montreal Protocol

CFCs used to be found in every refrigerator and the majority of aerosols. They have also been used in making fast-food containers, cavity insulation and many pieces of fire fighting equipment. Intense cobbying by scientists and environmentalists bore fruit in the late 1980s when a number of measures were agreed internationally to reduce the use of CFCs. The signing in 1987 of the Montreal Protocol by over 30 countries was particularly significant as it laid down targets to ensure that fewer CFCs were released into the atmosphere. The salient features are:

- To control and ultimately ban the production of CFCs and other ozone depleting substances (ODS) such as halons and carbon tetrachloride by the year 2000. As the developing countries face a formidable challenge in reforming their CFC use as they lack the financial and technological means available to the developed nations, the developing countries have been allowed a 10-year grace period (i.e. upto 2010) before full compliance is required of them to the Montreal Protocol.
- The Protocol provided for a multilateral fund to assist developing countries cover their incremental costs in eliminating CFCs and ODS.

India will get about $1.9 billion under the Protocol for using ODS substitutes. India for its part, has prohibited the import or export of eight substances related to the depletion of ozone to those countries which are not signatories to the Montreal Protocol. Trade in these commodities is permitted to the countries which are parties to the protocol.

### Environmental Consequences of Ozone Depletion

The impact of stratospheric ozone depletion is not entirely clear. Stratospheric ozone helps to prevent penetration of solar ultraviolet B (290-315 nm) radiation. UV-B radiation is the most energetic component of the sunlight reaching the Earth surface.

In humans, exposure to UV-B leads to an increase in cataracts and skin cancer decreased immune response to infections. It is probable that for each chronic (i.e. long term) 1% decrease in stratospheric ozone, there is a 2% increase in

non-melanoma skin cancer and 0.7% increase in cataracts.

### Effects on Plants and Animals

The effects on other species are also likely to be significant. Marine phytoplankton and terrestrial plants are harmed by raised UV-B levels as are a range of animals including fish, shrimps, crabs, insects and amphibians.

The damage caused to plants by UV-B radiation (290-315 nm):

- Absorption of UV-B photons leading to DNA damage
- Formation of free radicals leading to DNA damage
- Alterations to membrane structure
- Disturbance to membrane permeability
- Damage to photo system II (a pigment system in photosynthesis)
- Disruption in thylakoid membranes
- Reduction of chlorophyll content
- Damage to RuBP carboxylase (the enzyme that binds $CO_2$)
- Reduced levels of indolyl acetic acid (the plant growth hormone).

Still, it is unclear what the likely effects of interactions between the effects of ozone depletion, global warming and other consequences of pollution will be. Long term studies of lakes in Canada suggest that climate change, ozone depletion and acid rain may have more severe effects when acting together than when acting separately.

### Genetically Modified Food: Effects on Human Health

Recent advancement in the field of biotechnology has resulted in the creation of genetically modified foods through genetic engineering. In the US, the markets are already flooded with genetically modified tomatoes, soyabeen, corn, potatoes etc. Not only this, an estimated 4,000 experiments are still going on worldwide to genetically alter crops and farm animals.

In such a scenario, a serious debate has risen over the possible effect of such genetically modified foods on human health and the environment. Biotechnology Industry claims that they are absolutely safe and pose no danger, however many are not convinced.

Genetic engineering allows exchange of genes between different species. This makes it possible to create new species/design of plants or animals to meet specific economic goals. Critics believe this will destroy the ecological balance. Further genetic engineering routinely moves proteins into the food supply from organisms that have never been consumed as foods. The protein product of the inserted gene may cause unexpected reactions and produce potentially toxic products. There is also serious concern about the dangers of using genetically engineered viruses as delivery vehicle (vectors) in the generation of transgenic plants and animals as it could destabilies the genome of the host and also possibly create new and dangerous virsus. There have already been such instances. Bacteria genetically engineered by a Japanese company called Showa Denko KK to produce large amounts of food supplement tryptophan killed 35 people and permanently disabled 1,500 more in the United States.

Genes are also suitably altered for antibiotic resistance as "selectable mookers". The presence of antibiotic resistant genes in food could have the impact of reducing the effectiveness of antibiotics when they are taken with genetically engineered food stuff. If the resistant genes are transferred to human pathogens they will become immune to antibiotics.

Though the full set of risks associated with genetic engineering have not been identified, critics have pointed out that genetic pollution is self-perpetuating. It can never be reversed or cleaned up and mistakes will be passed on to all future generation of species. In the United States activists have launched vigorous campaigns for labelling of genetically modified food so that the consumers can make an educated choice. So far they haven't succeeded.

In India, no genetically modified food crop is grown. However, we are equally exposed to the hazards of genetically modified foodstuff as India imports many food items. Further there are no regulation and proper guidelines regarding testing and marketing of genetically modified crops in the country. What is needed is a thorough testing for possible side effects to ensure food safety before introducing such genetically modified products to the market.

### Seeds of Terminator Technology

Terminator seed which is also known as 'suicide seed' is a product of genetic engineering. The terminator seed terminates its own survival after one generation by aborting the process of embryo development. These seeds give rise to productive but sterile crop, which means the farm-sowed seeds will not germinate if used for raising next year crop. The produce can be used as food grains only. The

farmers are thus forced to be dependent on the seed company for the seeds every year. It's a threat to global agricultural bio-diversity and the well being of more than 1.4 billion rural people who depend on farm saved seeds for raising their crop. Virtually, all the giants in genetic engineering are working on their own genetic and sterilization patent claims.

The main concern regarding the seed is that the gene may get transferred to other plants and crops through free pollen grains. It is likely that the terminator will kill the seeds of the plants of the same species in the neighbouring fields under certain conditions. How many seeds perish, will depend on the degree of cross-pollination, and this is influenced by the species of plant, variety of the crop, weather conditions, how close the fields are associated to each other, etc. Even if only a few seeds die, they will contain the genes introduced into the terminator protected variety. The new genes may even make the seed unusable for certain purposes.

Since more than 70 per cent of the Indian farmers use farm-saved seeds for replantation, it is necessary that law is made not only to save our rich bio-diversity but also to protect the 'plant back seeds'.

### Controversy over Terminator Technology

Indian farmers have protested against terminator gene technology and transgenic plant technology. The United States Bio-tech company Monsanto is the reason behind this as it is associated with both technologies.

The multi-national agro-giant Monsanto started conducting field trials of Bollguard Cotton variety in India and claimed it was a huge success in several other countries. The trials were conducted in eight states of India including Maharashtra, Tamil nadu, Karnataka, Gujarat, Madhya Pradesh, Haryana and Punjab. The Indian farmers in December 1998 launched a nation wide agitation, and even set fire to some trial sites. The farmers are not convinced by the explanation given by Monsanto.

On February 22, 1999, Supreme Court of India, issued notice to the Union Government and Monsanto against illegal trials on genetically modified Bollguard Cotton at 40 trial sites in India.

The Union Government then promulgated the rules for the manufacture, use, import, export and storage of hazardous micro organisms/ genetically modified/ engineered organisms or cell. The rules state that all on going projects involving high risks and controlled field experiments shall be reviewed by RCGM (Review Committee for Genetic Manipulation) to ensure that adequate precautions and containment conditions are being followed.

As for GEAC (Genetic Engineering Approval Committee), it shall be responsible for approval of proposals relating to release of genetically engineered organisms and products into the environment, including experimental field trials. The RCGM can only approve of activities related to research in laboratories, contained field trials, and small scale experiments, the GEAC being the authority dealing the issue of permission for field trials.

As far as India is concerned, consumers and Indian farmers' interest should be kept paramount before conducting research and experiments in the field of genetic engineering. Simply following other countries would do no good.

### Genetically Modified Corn Safe

Amongst the present controversies relating to the genetically engineered food and its impact on human health, scientists have said that GM corn is safe and poses a "negligible" risk to monarch butterflies. The crop in question is known as BT Corn and Cotton. It contains a gene that causes the plants to produce a toxin that kills pests. Controversy has swirled around the crops since 1999, when Cornell University scientists reported that some monarch butterfly caterpillars had died when they ate pollen from BT corn in a laboratory experiments.

### Global Positioning System

Remote sensing has using satellite now made it easy to identify, map and monitor various natural resources. The spatial resoution of the data has undergone a sea change from about 80m in 1972 to about 1m now. In addition, the Global Positioning Systems (GPS) now enable determination of ground control in terms of latitude and longitude also.

Since the Gulf war, the GPS has certainly found its place in public awareness. It was originally designed to assist soldiers and military vehicles, planes and ships in accurately determining their location world wide. Today, the uses of GPS have extended to included both commercial and scientific worlds. Commercially, GPS is used as a navigation and positioning tools in aeroplanes, boats, cars and for almost all outdoor recreational activities. In the scientific community, it plays an important role in large range precise measurements, viz., earth-

